

"ఒసే కుంటీ ... ఒసేయ్ నిన్నే నే పలకవేమే?" అని రంగమ్మ బావి దగ్గర నీళ్లు చేదుతూ సుగుణను పిలిచింది.

సుగుణ పలకలేదు. మూతి ముడుచుకొని అమ్మదగ్గరికివచ్చి,

"అమ్మా చూడవే అత్తయ్య నన్ను ఊరికే, కుంటీ, కుంటీ అని పిలుస్తుంది" అని చెప్పింది. శేషమ్మ కిలకిలా నవ్వి సుగుణను అమాంతంగా చేతుల్లోకి తీసుకొని రెండు బుగ్గలూ కందిపోయేట్లు గట్టిగా ముద్దు పెట్టుకొని,

"ఏవమ్మా వదినా, ఎందుకమ్మా మాతల్లిని కుంటీ అంటావుట! సుగుణా అని పిలవకూడదటమ్మా" అని వినయంగా నవ్వుతూ అంది. రంగమ్మ నీళ్ళబింద నడుముమీదికెత్తుకొని ఇంట్లోకి తెస్తూ, "ఏమేపిల్లా నీవు కుంటిదానివి కాదటే. ఓయబ్బో, కుంటీ అని పిలవంగానే, ఎక్కడ మొక్కపోయిందో చూపించమ్మా! నీకు మంచి చక్కటి మొగుణ్ణి తెచ్చి పెళ్ళి చెయ్యమని మీ నాన్నతో చెప్తాలేవే, నీకేమీ దిగులేదూ" అని ఎగతాళిగా మాట్లాడింది.

"హాయొయ్యోతల్లీ, ఈ కుంటిపిల్లను ఎవరు చేసుకుంటారు వదినా?" అని శేషమ్మ, వదినవైపు నవ్వుతూ చూచింది.

"దానికేమే, బంగారుతల్లి, దానిముఖమే వెయ్యివరహాలు చేస్తుంది. ఎవ్వరూ చేసుకోకపోతే, మా చంద్రం ఉన్నాడుగా? వాడికే ముడిపెట్టేస్తే వాడితో బాటే, 'గాంధీమహాత్మాకీ జై, కాంగ్రెసుకీ జై' అంటూ కుంటికాలు ఎగరేసుకుంటూ, ఊళ్ళూళ్ళూ తిరుగుతూ ఉంటుంది." అంది రంగమ్మ.

"బాగుంది నీవు చెప్పేది. వాడికి ఈడెక్కడవుతుందే? అయినా వాడు స్థిమితంగావుంటే అనుకోవచ్చు. జైళ్ళకు పోనూ, రానూ సరిపోతూఉండె వాడికి. సంసారం చెయ్యాలని ఆపేక్ష ఉంటేగా?" అని శేషమ్మ సుగుణ తల నిమురుతూ చూచింది.

దయలేని దేవుడు సుగుణకు తీరని అన్యాయం చేశాడు. ఆమెను కుంటిదాన్ని చేసి ఈ లోకంలో వదిలిపెట్టాడు. అసలే ఆడపిల్ల; కుంటిది. ఇంక దానికి పెళ్లి ఎట్లా అవుతుందా? అని సుగుణ పుట్టిననాటినుండి, శేషమ్మకు ఒకటే దిగులు. వీలు దొరికినప్పుడల్లా అందరి దగ్గరా తన దిగులు వెళ్ళబోసుకొనేది.

సుగుణ తండ్రి రాఘవయ్య చిన్న వకీలుగారి దగ్గర గుమాస్తా. ఆయన శేషమ్మలాగా ఎప్పుడూ సుగుణసంగతి ఆలోచించేవాడే కాదు. కోర్టు పక్షులదగ్గర అణా, బేడా దండుకోవడంలో, ఆయన హృదయం మోడువారిపోయింది.

కొన్నాళ్లకి సుగుణకు తమ్ముడు కూడా పుట్టాడు. అప్పుడు సుగుణకు అయిదేళ్లు. తమ్ముడు మొట్టమొదట ఏడ్చిన ఏడుపు ఇంట్లోనుండి వినిపించగానే, సుగుణకి గొప్ప సందేహం కలిగింది.

అందరినీ తోసుకుంటూ ఇంట్లోకి వెళ్ళింది. "పోమ్మా పో, ఇప్పుడు రాకూడదు" అని ఆడంగులు అంటున్నా సుగుణ వినిపించుకోకుండా మంచందగ్గరికి వెళ్ళి, తల్లి పక్కలో ఉన్న బుజ్జితమ్ముణ్ణి తనివి

తీరా చూచింది. తమ్ముడి కాళ్లు రెండూ ఆసక్తితో జాగ్రత్తగా చూచి, సంతోషంతో పొంగిపోయింది. సుగుణ ఇంట్లో నుండి వాకిటికిలోకి వచ్చి కూచొని, తన కాలు ఒకసారి చూచుకొంది. ఒక పాదం, ముద్దలాగా ఉంది. వ్రేళ్లు వంకరతిరిగిపోయి ఉన్నాయి. "అలా ఎందుకుందో" అని సుగుణ కొంచెంసేపు ఆలోచించింది. కానీ సమాధానం దొరకలేదు.

ఒకనాడొక కుంటివాడు ముష్టికొచ్చాడు. చేతుల ఆధారంతో జరుగుతూ, మెల్లగా యింటింటికి తిరుగుతున్నాడు. వాడు రాగానే సుగుణ ఆశ్చర్యంగా చూస్తూ నిల్చొని—

"మీదేవూరబ్బీ" అని అడిగింది.

"బుల్లెమ్మా, మాది హైద్రాబాదు; ఆ దేవుడికి ఎంతబుద్ధి లేదమ్మా? ఇంత చక్కటి పిల్లను, కుంటికాలిచ్చాడు, ఏంచేస్తాం తల్లీ మన కర్మకు దేవుడేం చేస్తాడు?" అన్నాడు.

సుగుణ ఇంట్లోకి వెళ్ళి దోసిలినిండా బియ్యం తీసుకొచ్చి ముష్టివాడికి పెట్టింది.

రంగమ్మ సుగుణను తరుముకుంటూవచ్చి, "ఒసే కుంటిముండా, ఎవరికే సేరుబియ్యం తీసుకెళ్లి పోస్తున్నావు" అని కేకలేస్తూ వాకిటిలోకి వచ్చి, ముష్టివాణ్ణి చూచింది. పెద్ద దున్నపోతులాగా ఉన్నాడు. ఒళ్లంతా దుమ్ముకొట్టుకు పోయిఉంది. ఒక చొక్కా, చిన్న చెడ్డీ వేసుకొని ఉన్నాడు. "ఏమయ్యా, పెద్ద అంబోతులాగా ఉన్నావే, ఎందుకీ దొంగవేషాలు! లక్షణంగా ఏదైనా పనిచేసుకోక, ఎందుకయ్యా యీ అవస్థ" అని అడిగేసింది. అతడు మెల్లగా తల పైకెత్తి, రంగమ్మ ముఖంలోకి చూచాడు. ఆ చూపును వర్ణించడానికి మాటలు చాలవు. ఎంతటి ప్రతిభావంతుడైన నటుడైనా ఆ చూపు నటించలేడు.

"అమ్మా! నేను బి. ఏ. దాకా చదువుకున్నాను. రైల్వేలో గుమాస్తాగా చేరాను. పెళ్లి చేసుకున్నాను — రెండుకాళ్ళకూ పక్షవాతం వచ్చింది. భార్య వదిలిపెట్టి వెళ్ళిపోయింది. ఒక అన్నదమ్ముడుంటే వాడు వాడి సంసారం పోషించుకోలేక నానా యిబ్బందులూ పడుతున్నాడు. అన్ని ఆస్పత్రులూ తిరిగాను. ఎందరు డాక్టర్లో చూచారు. కానీ ఎవ్వరివల్లా కాలేదు. నాకు ఈ ప్రపంచంలో ఇంకెవ్వరూ లేరమ్మా. ఎప్పటికైనా ఆ భగవంతుడికి దయకలిగితే..." అని దుఃఖము ఆపుకోడానికోసం గట్టిగా పళ్లు బిగబట్టాడు.

రంగమ్మ ముఖం వెలవెలబోయింది. కానీ ఆమెకు ఆ కుంటివాడిమాటలు నిజమో కాదో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది.

"ఒసే సుగుణా ఇంట్లోకిపోయి, ఏదైనా ఇంగిలీషు రాసిఉండే కాగితం తీసుకురా. వీడి సంగతేమిటో కనుక్కోవాలి" అంది. సుగుణ గునగున నడిచిపోయి నాన్నగారి కాయితాల్లోంచి ఒక కట్ట కాగితాలు తీసుకొచ్చింది.

రంగమ్మ ఠీవిగా నిల్చొని "అబ్బాయ్, ఇదేమిటో చదువు చూసాం" అంది.

ఆ కుంటివాడు ఇంగ్లీషుకాగితం చదివి అర్థం చెప్పాడు. అవేవో కేసు తాలూకు కాగితాలు. ఒకావిడ తన భర్త ఆస్తిని దుర్వినియోగం చేస్తున్నాడని, తనను తన బిడ్డల్ని కాపాడమని, న్యాయమూర్తులకు విన్నపం చేసుకున్న కాగితాలు అవి.

అది విని రంగమ్మ "అమ్మో వీడు అసాధ్యుడులా ఉన్నాడే" అనుకొని, కొంచెం పశ్చాత్తాపపడి, "అయ్యో నాయనా, ఎంత కష్టం వచ్చిందిరా నీకు?" అని లోపలికి వెళ్లిపోయింది. ఆ కుంటివాడు సుగుణకు చూపులతో ధన్యవాదాలు అర్పించి, నెమ్మదిగా జరుగుతూ వెళ్లిపోయాడు సుగుణ అతనివైపే చూస్తూ కొంతసేపు నిల్చుంది.

## 2

కొంతమంది మనుషులకు పసిపిల్లలను ఏడిపించుకొని ముచ్చటపడడం అలవాటు. సుగుణ మేనత్త రంగమ్మకు సుగుణను ఏడిపించుకొని తినటం చాలా ముచ్చట.

ఒకనాడు రంగమ్మ వకీలుపోజులో నిల్చొని "ఏమే శేషూ? దీని కాళ్ళేళ్లు?" అని అడిగింది. "అయిందో ఏదో కదటమ్మా వదినా" అని నీరసంగా జవాబిచ్చింది శేషమ్మ.

"దీన్ని బడికి పంపించకూడదూ? ఇంట్లో ఉండి ఏంచేస్తుంది?" అంది.

"హాయ్యోరామ. దాన్ని బడికి పంపించడానికి తాతముత్తాతలు దిగిరావాలి. నావల్ల కాక వదిలేశాను" అంది శేషమ్మ.

రంగమ్మ కృత్రిమ కోపం నటిస్తూ "ఒసే పిచ్చిముండా; బడికిపోయి శ్రద్ధగా చదువుకోవే. అసలే కుంటిముండవు. చదువు రాకుంటే, నిన్నెవరు పెళ్ళిచేసుకుంటారే? పో ముందు బడికి" అని దబాయించింది.

"పోమ్మా పో" అని శేషమ్మ పల్లవిపాడింది. సుగుణ పిల్లిలాగా మెల్లిగా ఇంట్లోకి వెళ్ళి, పలక బలపం తీసుకొని, తన స్నేహితురాలు సరోజనిదగ్గరికి వెళ్లి "సరోజా, ఇవాళ నేనుకూడా బడికి వస్తానే" అంది.

సరోజ ఎగిరి గంతేసింది. "మనిద్దరం, ఒక బెంచీమీదే కూచుందామే సుగుణా, మన దగ్గరికి ఇంకెవ్వర్నీ రానివ్వకూడదు" అంటూ బడికి బయలుదేరింది.

సరోజని తాలూకాఫీసులో గుమాస్తా, రామారావుగారి కూతురు. సుగుణా సరోజా ఇద్దరూ ఒక ఈడువాళ్ళే. ఒకరి భుజాలమీద ఒకరు చేతులేసుకొని మెల్లగా బడికి చేరుకున్నారు.

ఇంకా అయ్యవార్లు ఎవ్వరూ రాలేదు. పిల్లకాయలు గొర్రెలమందలాగా గోలచేస్తున్నారు. సరోజని, సుగుణ బడిలో అడుగుపెట్టగానే, సుగుణ తన జీవితంలో ఎన్నటికీ మరిచిపోలేని సంఘటన ఒకటి జరిగింది.

ఒక అబ్బాయి సుగుణకు ఎదురుగావచ్చి నిలబడి కళ్లల్లో కళ్లు పెట్టిచూచి, వినయంగా వంగి "హలో, డియర్ కుంటి కులాసం గారూ, గుడ్‌మార్నింగ్" అన్నాడు.

సుగుణ, సరోజని చెయ్యి గట్టిగా పట్టుకొని, ఒదిగి నిల్చుంది. సరోజని చెయ్యి విడిపించుకొని బాగా పైకెత్తి ఫెళ్లున ఒక చెంపదెబ్బ కొట్టింది వాణ్ణి. వాడికి చీమకుట్టినట్టయినా లేదు. సరోజనిని ఒక్క తోపుతోసి సుగుణదగ్గర చేరి:

"కుంటి కులాసం, ఇంటికి మోసం" అని పాడుతూ డాన్సు చెయ్యడం మొదలుపెట్టాడు. మిగిలిన పిల్లలు కొంతమంది దద్దమ్మల్లా కూచున్నారు. కొంతమంది కిలకిలా నవ్వుతూ ఆనందిస్తున్నారు.

సరోజని, సుగుణను దగ్గరికి లాక్కొని "ఒరేయ్ మోహన్, చూస్తాండు నిన్ను ఇవాళ ఏమిచేస్తానో. చూస్తాండు. అయ్యోర్ని రానీలే" అని త్రాచుపాములాగా బుసకొడుతూ అంది.

ఆయన ఇంటికి రాగానే ఆవిడతో చెప్పాడు.

"నేనీ వేళ నా జీవితం భీమా చేయించుకున్నాను"

ఆవిడ పనితో సతమతమౌతూ విసుగుతో ఇచ్చిన సమాధానం ఇది.

"ఎన్నాళ్లు మీ విషయమే మీకుగాని మా గొడవ పట్టదు. మీరు భీమా చేయించుకుంటే చేయించుకున్నారు గాక. అంత మాత్రాన నాకేం ఒరిగింది?"




మోహన్ డాన్సు చెయ్యడం క్షణంసేపు ఆపి, "హాయ్యో దేవుడా, నేనేం చేసే దయ్యా, ఈరోజు సరోజనీదేవిగారు నాకు మెడకాయమీద తలకాయ లేకుండా చేయిస్తారేమో" అని వినయంగా వంగి—

"రాణిగారూ? ఏదో దయనూపండి. పేదోణ్ణి" అన్నాడు. పిల్లలందరూ గొల్లున నవ్వేరు.

ఇంతలోగా, శుభ్రంగా తయారయి, స్కూల్లో అడుగుపెట్టిన ఇంకొక ఎనిమిదేళ్ల అమ్మాయి సుగుణను, సరోజనిని చూచింది. ఒక్కసారి చిరునవ్వు నవ్వి మోహన్‌వైపు చూచింది. మోహన్ సంతోష సాగరంలో మునిగితేలుతూ "కుంటి కులాసం, ఇంటికి మోసం" అని హరిదాసులాగా పాడుతున్నాడు.

కొత్తగావచ్చిన అమ్మాయి మోహన్‌తో పాటు గొంతుకలిపి, "సా, స, ని, ధ, ప, మ, గ, రి, స కుంటి కులాసం, ఇంటికి మోసం" అని పాట అందుకుంది. పిల్లలందరూ పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుతున్నారు. సుగుణ అవమానం భరించలేక, పెద్దగా ఏడవడం ప్రారంభించింది. సరోజని కోపంతో రగిలిపోయింది. పరుగెత్తుకుంటూ వెళ్ళి సనిధపమగరిసలు వేస్తూ తన్మయత్వంలోఉన్న కమలను, రెండు జడలు, రెండుచేతులతో పట్టుకొని, వెంకాయపీచు తీసినవిధంగా లాగి లాగి, ఇంకా కసితీరక చేతిమీద గట్టిగా కొరికింది.

పాపం, కమల బావురుమని ఏడుస్తూ దిక్కులేనిదానిలాగా నిల్చుంది.

"ఏమిట్రా ఇది, ఏమిట్రా, ఈగోల," అంటూ బిడ్డగానిలాగా ఉన్న ఒక నల్లటి వ్యక్తి లోపలికొచ్చాడు. పిల్లలందరూ బెంచీలమీద కొందరు, కటికనేలమీద కొందరూ, కూచున్నారు. కొంతమంది తాము బెంచీలమీదే కూచోవాలని, లేకుంటే గుడ్డలు మాసిపోతాయని పోరాడుతున్నారు. కమల దిక్కులేనిదానిలాగా ఏడుస్తూ, తనచెయ్యి అయ్యవారిదగ్గర పెట్టి, "సార్, చూడండిసార్, సరోజని ఎట్టాకొరికిందో చూడండిసార్" అని వెక్కిళ్లు పెడ్తూ చెప్పింది.

వెంటనే సరోజని "సార్, నేను... ఈ అమ్మాయిని బడికితీసుకొస్తే, కుంటికులాసం ఇంటికి మోసం అని పాటలు పాడుతూ, మోహన్, కమల, ఏడిపించుకొని తింటున్నారుసార్" అని మనవి చేసింది.

"ఒరేయ్ మోహన్; ఏడిరావాడు?" అని పంతులుగారు నాలుగుదిక్కులా చూచాడు. మోహన్ బుద్ధిమంతుడిలాగా కూచొని ఏదో రాసుకుంటున్నాడు.

"ఒరేయ్‌దొంగా, రా యిట్లా" అన్నాడు మేష్టరు.

"ఏమిటిసార్ ? నాకేమీ తెలియదు సార్" అని మోహన్ నిర్దోషిలాగా నిల్చున్నాడు.

"ఒరేయ్ బడుద్ధాయ్, అటు గోడమీద చూడు" అని చూపించాడు అయ్యవారు.

"సత్యమే జయించును; అబద్ధము లాడరాదు" అన్న నీతి వాక్యాలు గోడలనిండా అంటించిఉన్నాయి. మోహన్ వాటిని ఒకసారి చదివి, అబద్ధం చక్కగా నమ్మేట్లు ఎలా చెప్పాల్నా అని బాగా ఆలోచించి, "బడికి మీతోకూడా నే వచ్చానుసార్ నేను వచ్చేటప్పటికి, సరోజని, కమల, తన్నుకుంటున్నారు" అని నంగనాచిలా చెప్పాడు.

"కొబ్బరిబొబ్బ, పిడుగువురా నువ్వు. చస్తే ఇంక పుట్టబోవు" అన్నాడు అయ్యవారు విసిగి.

"వరేసార్, చచ్చిపోతా లెండి సార్" అని బుంగమూతి పెట్టుకొని అన్నాడు మోహన్. పిల్లలందరూ గొల్లున నవ్వారు.

"ఒరేయ్ వెధవా యిల్లా రా నేను అన్నం తిని రాలేదు. కడుపు మండిపోతూ ఉంది. ఇప్పుడు నన్ను విసిగించారంటే, ఒక్కొక్కరిని తోలు ఒలిచేస్తా" అన్నాడు అయ్యవారు.

కమల ఇంకా ఎక్కిళ్లు పెడుతూ, ఏడుస్తూనే ఉంది.

పంతులుగారు సరోజనిని చెవ్వు పట్టుకొని ఆ అమ్మాయిని అట్లా ఎందుకొట్టి కావ్? నీకేమైనా కుక్కవా, మనిషివా చెప్పూ చెప్పూ" అంటూ చెవ్వు కసకస నలిపేశాడు.

సరోజని "అమ్మా, అమ్మా" అని గిజగిజలాడుతూ ఏడిచింది. అదిరిపోయాడు అయ్యవారు. "అదికాదమ్మా, చూడు, ఆ అమ్మాయి, నీలాంటి పిల్లకదూ? అట్లా కొరకొచ్చా?" అని మళ్ళి ఓదార్పడం ప్రారంభించాడు.

"సుగుణను, కుంటిపిల్ల అని కమల ఎగతాళి చేస్తూఉంది సార్" అని సరోజని అయ్యవారికి మనవి చేసింది.

అయ్యవారు మళ్ళి తనను కొడ్తాడేమో నని కమల ఏడుపు శృతి ఎక్కువచేసి, భోరున ఏడవడం ప్రారంభించింది.

"హాయ్యో భగవంతుడా? జన్మజన్మలకి, ఈ బడిపంతులుపని వద్దురా" అని అయ్యవారు చెవులుమూసుకొని, తనను కడతేర్చమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నట్లుగా కళ్లు మూసుకున్నాడు.

"ఏమిటయ్యా · ఈ గోల?" అంటూ హెడ్మాష్టరుగారు లోపలికొచ్చారు.

"ఏమీలేదండి, ఏమీ లేదండి" అని చిన్నపంతులుగారు సర్దుకుని "ఇది ఒక ఆవు. దీనికి నాలుగు కాళ్లుండును" అని పాఠం చెప్పడం ప్రారంభించాడు. హెడ్ మాష్టరుగారు తృప్తిపడి "ఒరేయ్ అయిదో క్లాసు వెధవల్లారా, మీరు పదకొండవ రెక్కం మొదలు, యిరవై ఎక్కంవరకు వేసి నా దగ్గరికి తీసుకరండి" అని ఆజ్ఞాపించి, తన కుర్చీలో వెళ్లికూచొని గవర్నమెంటువారిచ్చే గ్రాంటులో ఎంత గుటకాయస్వాహా చెయ్యడానికి వీలుంటుందా" అని ఆలోచించడం ప్రారంభించాడు.

ఎప్పుడెప్పుడు గంటకొడతారా, ఆక్లాస్లో నుంచి ఎప్పుడు బయటపడదామా అని సుగుణ ఎదురుచూస్తూ కూచుంది. బడి వదలంగానే సంతోషంతో సరోజని చెయ్యి పట్టుకొని వీధిలోకి పరుగెత్తింది. కానీ మోహన్‌మాత్రం సుగుణను, ఇంటికి పోయేవరకు ఏడిపించుకొని తిన్నాడు. పాపం కమల ఇంకా ఎక్కిళ్లు పెడుతూనే ఉంది.

ఆ రోజునుంచి సుగుణ మళ్ళీ బడిలో అడుగు పెట్టనేలేదు. ఆనాటి సంఘటన ఆమె హృదయంలో శాశ్వతమైన గాయంగా నిలిచిపోయింది. అందువల్ల ఆమెలో కొంత పిరికితనం వృద్ధిఅయింది.

కానీ రంగమ్మ వదిలిపెట్టేటట్లు లేదు. "ఏమే శేషూ, దాన్ని బడికి పొమ్మని చెప్పవేమే?" అంది.

"ఏం చెయ్యను వదినా, ఆ దయ్యం

పోతేగా. దానికి చదువుకోవాలని ఉంటే అనుకోవచ్చు" అంది శేషమ్మ.

"నేను ఇంట్లోనే చదువుకుంటా శేషమ్మా. బడికి పోతే పిల్లలందరు ఏడిపించుకొని తింటున్నారమ్మా" అని సుగుణ కళ్ళనీళ్లు పెట్టుకుంటూ చెప్పింది.

"ఓసి జాణకదే, జాణా; బడికిపోకుంటే చదువెట్లా వొస్తుందే నీకూ? ఏమోలే, నా మంచికే చెప్తున్నాను. వేలు వేలు పోసి, అల్లుణ్ని తీసుకొస్తారుగా; చదువుకోకపోతే మాత్రం ఏం?...బుద్ధి తక్కువదాన్ని నే నెందుకు చదువుకోలేదా అని ఇప్పుడను కుంటున్నాను. మొగుడు లేకపోతే పోయాడు మొద్దులు. చదువుకోనైనా ఉంటే, నేనూ ఒక అయ్యవారమ్మనయి ఉండేదాన్ని ఇంటింటా ఈ వంటచాకిరీ తప్పేది" అని తన మనసులోని అక్కసు వెళ్లబోసుకుంది. వదినగారితో వాదించటం ఎందుకని శేషమ్మ ఊరుకుంది.

## 3

ఆవాడు సుగుణతమ్ముడికి బారసాల. ఇంట్లో అందరూ స్నానాలుచేసి పురుడు తీర్చుకొన్నారు. ఇలంతా ముగ్గులు పెట్టి చుట్టూ ఎఱ్ఱమట్టిపట్టీలు తీర్చి దిద్దింది రంగమ్మ. ఇల్లు కొత్త అందంతో కళకళ లాడుతూ ఉంది.

రంగమ్మ ఇంట్లో చాకిరీఅంతా చేసుకొని పెన్నానదికి పోయి స్నానంచేసి, రంగ నాయకస్వామికి ప్రదక్షిణాలు చేసుకొని ఇంటికొచ్చేసరికి పదిగంటలయింది. పొద్దు చూచి, గాభరాపడి ఆమె వంటప్రయ త్నంలో నిమగ్న అయింది.

సుగుణ, వాకిటఅరుగుమీద బొర్లా పండు కొని గుణింతాలు దిద్దుకుంటూ ఉంది.

ఎవరోవచ్చి, సుగుణవీపుమీద తలఆనించి కదుకున్నారు.

"ఏయ్; ఎవరునువ్వు; లే. లే. అమ్మో" అని సుగుణ ఆ మనిషిని తోసేస్తూ అరిచింది. ఆ పెద్దమనిషి లేవకుండానే

"వాబ్బా! దిండు ఎంత మెత్తగాఉంది! అరె! దిండు మాట్లాడుతూఉందే! అరరె దిండుకు కాళ్లూ చేతులూకూడావచ్చాయే!" అని మెల్లగాలేచి సుగుణను దగ్గరికి తీసు కున్నాడు.

శేషమ్మ బాలింతముసుగు సవరించు కుంటూ ఇంట్లోనుండి గబగబావచ్చి,

"ఏంనాయనా చంద్రం, ఇప్పుడేనా రావటం?" అని గద్గదస్వరంతో అడిగింది.

"అవునక్కయ్యా మొన్ననే జైలునుంచి విడుదల అయ్యాను" అన్నాడు చంద్రం.

ఇంట్లోనుంచి పసిబిడ్డఏడుపు విని పించింది. చంద్రం నవ్వుతూ అక్కయ్య ముఖం చూచాడు.

శేషమ్మ తమ్ముడికిఎదురుగా కూర్చుంటూ

"అల్లుడు పుట్టాడయ్యా నీకు, ఈరోజే బారసాల. చుట్టాలు రాలేదనే కొరత రానీయకుండా భగవంతుడు నిన్ను ఇక్క డికి పంపించాడు." అని శేషమ్మ ముఖా నికి పమిట చెరగు అడ్డం పెట్టుకుంది.

సుగుణ చంద్రంచేతుల్ని విడిపించుకుని అమ్మదగ్గిరకు పోయి కూచొని, "అమ్మా, ఆయ నెవరే?" అని మెల్లగా అడిగింది.

శేషమ్మజాలిగా సుగుణకళ్లల్లోకి చూస్తూ



# సుగుణ



"మీ మామయ్యేనమ్మా. నీ పెళ్ళైనా వాళ్లే చూస్తేగా" అని దుఃఖం అణుచుకుంటూ చెప్పింది.

సుగుణ మెల్లగా తలెత్తి మామయ్యను సిగ్గుతో ఒకమారు చూచి "అమ్మా! మామయ్య బలేబాగున్నాడే!" అని మనసులోనే అనుకుని, తల్లి ఒడిలో తలదాచుకొంది.

రాఘవయ్యగారు, కాగితాలకట్ట చంకలో పెట్టుకొని త్వరత్వరగావచ్చి, చంద్రాన్ని చూచి, ఆశ్చర్యపడి కడపలోనే నిల్చొని, "ఎప్పుడొచ్చావు నాయనా?" అని మెల్లగా అడిగి హృదయపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు.

"ఇప్పుడే వస్తున్నాను బావా" అని చంద్రం బావగారికి జవాబిచ్చాడు.

"ఏమే, వాడు జైలునుంచి విడుదలైవస్తే అప్పుడే దగ్గరకూర్చొని నీసోద ప్రారంభించావా? ఇంత కాఫీ అయినా ఇచ్చావా లేదా?" అన్నాడు రాఘవయ్య.

"హాయ్యోరామ. లేదండీ" అని శేషమ్మ లేచి లోపలికెళ్ళి చంద్రం వచ్చాడని రంగమ్మ వదినకు చెప్పింది.

రంగమ్మ, కూరతిరగమోత వేస్తూ, గిన్నె పళ్ళాలను కిందపడేసి, వాకిటికి వచ్చి గొంతు సవరించుకొని; "ఏంనాయనా చంద్రం. మేము జ్ఞాపకమున్నామన్న మాట" అంది.

"హారొయ్యో, ఏమిటి వదినా నేనేమి అంత మతిమరుపు మనిషి ననుకున్నావా?"

"కాదులే, మీరంతా దేశోద్ధారకులు. మాబోటివాళ్లం జ్ఞాపకం ఉంటామా?" అని నవ్వింది రంగమ్మ.

ఇంతలో శేషమ్మ కాఫీ తీసుకొచ్చి చంద్రానికి అందించింది.

రంగమ్మ చంద్రానికి ఎదురుగా కూర్చొని "నేను నీలాగా చదువుకున్నదాన్ని కాదు. కానీ నాకు తోచినమాట నే నెప్పుడూ మనసులో పెట్టుకొనేదాన్ని కాదు. ఏమిట్రా ఈ పాడుముండ ఇలా అన్నది అని నీవు అనుకుంటే అనుకోవచ్చు- లక్షణంగా పెళ్ళిచేసుకొని సంసారం చెయ్యక, ఎందుకు చెప్పా ఈ తంటాలు? అది నీకోసం ఎంత ఇదవుతుందో నీకేం తెలుసు? పుట్టింటి ఆశ అంటూ ఏ ఆడదానికైనా ఉంటుందా ఉండదా? నీవే చెప్పు. ఇంక దానికి నీవుతప్ప ఇంకెవ్వరున్నారు?" అని రంగమ్మ చంద్రం కళ్లల్లోకి ధీమాగా చూచింది.

ఆడవాళ్లు మాట్లాడినంత చాతుర్యంతో మగవాళ్లు మాట్లాడలేరు.

చంద్రం, ఎన్నో సభల్లో ఉపన్యాసాలిచ్చాడుకాని రంగమ్మప్రశ్నకు జవాబు చెప్పడానికి కొంచెం తడబడ్డాడు.

"నిజమే వదినా...లోకంలో కొంతమంది సుఖపడ్డానికోసం పుడతారు; కొంతమంది కష్టాలుపడ్డంకోసం పుడతారు. నాలాంటివాళ్లకి కష్టాల్లోనే ఏదో సుఖం ఉన్నట్లు కనిపిస్తుంది." అని, కాఫీ ఒక గుక్కెడు త్రాగి, లోటావైపే క్షణంసేపు చూచాడు. చంద్రం మనసులో చాలా సంఘర్షణ ఏదో జరుగుతూఉందని రాఘవయ్య అర్థం చేసుకొన్నాడు.

"ఏమిటమ్మ నీసోద? వాడు రాకరాక ఇంటికొస్తే, నీ రామాయణం వాడిముందు పారాయణంచేస్తే ఎలాగూ?" అన్నాడు.

రంగమ్మకు, మొగవాళ్లతో మాట్లాడడం అంటే చాలాయిష్టం. పాపం చిన్నప్పుడే భర్త చనిపోయాడు - మనసులోఉన్నమాట ముఖాన్నే అడిగేస్తుంది. అందువల్ల ఆమె అపవాదులూ, ప్రమాదాలూ చాలాసార్లు ఎదుర్కోవాలిసొచ్చింది.

"బుద్ధిః కర్మానుసారిణీ, అన్నారు. మనం నిమిత్తమాత్రులమే. జరిగేదెటూ జరుగుతూనే ఉంటుంది" అంది రంగమ్మ.

"వదినగారికి వేదాంతంలోకూడా బాగా పాండిత్యంఉన్నట్లుందే?" అని చంద్రం పకపకా నవ్వాడు. రంగమ్మకూడా తృప్తిగా నవ్వి వంటయింట్లోకి వెళ్ళిపోయింది. ఒక మగవాడు కొంచెం సానుభూతి చూపి మెచ్చుకొంటే చాలు, ఆమె హృదయం తృప్తిపడిపోతుంది.

నామకరణం చేయించడానికి పురోహితుడొచ్చాడు.

"ఏమిటిబావా; నీవు సంపాదించేది పదిరూపాయలైనా, ఖర్చుపెట్టేది వందగా ఉందే?" అన్నాడు చంద్రం.

"ఏమిచేస్తాంరా, మన ఆచారాలు, సంప్రదాయాలూ పోగొట్టుకుంటామా? మా కాలం ఇలాగే వెళ్ళిపోతుంది. మీ తరం వచ్చేటప్పటికి, అసలు తద్దినం పెట్టేవాళ్లు కూడా ఉండరు." అన్నాడు రాఘవయ్య.

"ఇంత దుబారా ఖర్చు చేసుకుంటుంటే నీవు ఇంక మిగిల్చేదేముంది బావా? కొంచెం ముందు జాగ్రత్త ఉండకపోతే సంసారం జరగాల్నా పనిలేదా?" అన్నాడు చంద్రం.

రాఘవయ్య పకపకా నవ్వి "నీకేం మిగిల్చావో చెప్పు నాయనా. తండ్రి సంపాదించిపెట్టిపోయినఆస్తి, కాంగ్రెసులోచేరి చిల్లిగవ్వ లేకుండా చేశావు. నీవు నాకు సలహా చెప్తున్నావు" అన్నాడు.

"నాకూ నీకూ భేదం లేదా బావా? నేను సన్యాసిని. నీవు సంసారివి" అన్నాడు చంద్రం.

"రాఘవయ్యా, ఇంకా స్నానం చెయ్యలేదాయ్యా?" అన్నాడు పురోహితుడు.

రాఘవయ్యగారు లేచి స్నానానికివెళ్తూ "ఒరేయ్ చంద్రం, రారా, నీవు కూడా స్నానం చేద్దువు గాని" అన్నాడు.

స్నానాలు పూర్తయిన తర్వాత, నామకరణ మహోత్సవం ప్రారంభమయింది.

"మీ అల్లుడికి పేరు ఏం పెట్టమంటావు చంద్రం?" అన్నాడు రాఘవయ్య.

"సుభాష్ చంద్రబోస్ అని రాసెయ్ బావా" అన్నాడు చంద్రం. అందరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

"ఛీ, ఛీ, ఆ పేరెందుకురా. లక్షణంగా, రంగనాయకుల పేరో, వెంకటేశ్వరస్వామి పేరో పెట్టుకోకా! అంత ఇంకా ముచ్చటగా ఉండాలనుకుంటే, సుధాకరుడు అని పెట్టండి" అంది రంగమ్మ.

అందరూ సరే నన్నారు. రాఘవయ్యగారు ఉంగరం తీసుకొని బియ్యంలో రాసేశాడు.

రంగమ్మ "నాకు ఈ ఇంట్లో ఇంత మాత్రం కోదా ఉంటే చాలు" అనుకొని ఆనందంతో పొంగిపోయింది.

భోజనాలయినతర్వాత చంద్రం సుగుణను దగ్గర కూచోపెట్టుకొని ఎన్నో కథలు చెప్పాడు. సాయంత్రందాకా మామయ్యను వదిలిపెట్టకుండా తిరిగింది సుగుణ.

జిల్లా కాంగ్రెసుసమావేశం ఉందని ఆరోజు సాయంత్రమే వెళ్ళిపోయాడు చంద్రం.

"అమ్మా, మామయ్య మళ్ళీ ఎప్పుడొస్తాడే" అని సుగుణ అమ్మను అడిగింది.

"ఏమోనమ్మా, వాడిమతం వాడిది. ఇష్టం ఉంటే వస్తాడు. లేకుంటే లేదు." అని శేషమ్మ విసుక్కుంది.



[ఇంకా ఉంది]

# స్వగతం చెప్పిన తీర్పు

ఈ యిరవయ్యో శతాబ్దపు ఉత్తరార్ధంలో మూడు సంవత్సరాలు ముగిశాక, నాలుగో సంవత్సరపు అర్ధభాగంలో వొకనాటి రాత్రి యెనిమిది గంటలప్పుడొక చిమ్నీదీపం బల్లమీద పెట్టుకుని జీవితాన్ని గూర్చి అంచనా వేసుకోవడం ప్రారంభించాడు; రాధాకృష్ణమూర్తి, బి. ఏ. (ఫైల్డు).

ప్రస్తుతం అతడు నివసిస్తున్న దొక పట్టణంలోనే. అది ఆంధ్రదేశంలో చరిత్ర ప్రసిద్ధిగన్నదే. ఉంటున్న దొక భవనం కాదు; తాతలనాడు కట్టించిన మండువా లోగిలి.

అతడు కూర్చున్న కొయ్యకుర్చీ, దానిపై పరచివున్న చిత్రాసనం, తగరం మూతతో తూట్లు మాయించిన ఆ చిమ్నీదీపం, అతడికి తండ్రిగారి తరంనించి సంక్రమించిన చరాస్థిలోని భాగాలే.

అచ్ఛంగా యీ కుర్చీలో, యీ బల్లమీద యీ దీపం పెట్టుకు కూర్చుని అహోరాత్రాలూ ఆయన యెన్ని జిల్లాబోర్డు ఫైళ్లు పూరించేవాడో...

ఎదురుగుండా అల్మైరాలో భద్రపరచబడి చవుడుగొట్టుకు పడివున్న ఊటకలం వేళ్ళకి తిలకించితే యిప్పటికీ అదే స్పృహ కలుగుతుంది. ఏదో వ్రాస్తున్నట్టే, బరబరా పరుగెత్తుతూన్నట్టే వుంటుంది. ఆ కలం పరుగులే కాలాన్ని పడలాక్కుపోతుంటే అచ్ఛంగా అంకెలూ, అక్షరాలలాగే ఆయన రోజులు గడచిపోయినై. పింఛను పుచ్చుకోకముందే ఇహాన్ని చాలించుకుపోయినా, రెండు దశాబ్దాలపాటు బోర్డువారికి ఎనలేని సేవ చేశాడు. అయినా ఆయన స్వహస్తంతో చందాకట్టిన ప్రావిడెంట్ ఫండ్ లెక్కగట్టి యివ్వడానికే ముప్పతిప్పలు పెట్టారు.

ఒక్క ముక్కలో అనుకోవాలంటే యెంత ఒళ్లు విరుచుకు పాటుబడినా రెట్టికీ – శెణికీరాని శ్రమ ఆయనది. ఆత్మీయులుగానే వుండి ఆయనదగ్గిర కాస్తో – కూస్తో ఆరగించినవాళ్ళే చివరికి నెత్తిన చేతులు పెట్టారు. అచ్ఛంగా తనకీ ఆ జాతకమే అనువర్తిస్తోంది. ఈ తలంపు మెదడులోకి రాగానే అతని ఆలోచనలు, అంచనాలు కూడా ఒక్క తరం ముందుకు దూకినై—

—నామకరణంనాటి రాధాకృష్ణమూర్తి ఇప్పుడు 'కిష్టప్ప' అయ్యాడు. ఈ తరం నాటి మిత్రమండలి తనకు చేసిన బహుమతి ప్రదానాల్లో యిదివొకటి, ప్రముఖమైంది కూడా. అదే యింటా - బయటా చెల్లిపోతోంది.

—కిష్టప్పగానే తను హైస్కూలువిద్య ముగించి కాలేజీలో అడుగు పెట్టేనాటికి జీవితాన్ని గురించిన కష్టసుఖాలు అంతగా తెలియవు. అందువల్లనే విద్యార్థి సాధారణమైన మనశ్చాంచల్యం తన నావరించింది. చేసేది గుమాస్తా ఉద్యోగమైనా మిగతా అందరితోపాటే తన చదువుకి యేలోటూ రానీయలేదు నాన్న. పెద్దన్నయ్యను బి. ఏ. చదివించినా, చిన్నవాడికి బి. ఎల్. కోర్సు పూర్తి చేయించినా అదంతా ఆయన ప్రయోజకత్వమే అనాలి.

అయితే వాళ్ళకూ తనకూ మన స్తత్వంలోనే పెద్ద తేడా వున్నది. తను వాళ్లనించి

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## ఘట్టి కృష్ణమూర్తి

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

యిలా వేరైపోవడానికి కారణం యేమిటో యీనాడు గ్రహింపుకి వస్తున్నది లీలగా. భవిష్యత్తునిగూర్చి వాళ్లు కొన్ని అంచనాలు ఏర్పరుచుకొని వుండాలి, దానికి తగినట్లు పెళ్ళి పేరంటం కానిచ్చుకుని జీవితంలో స్థిరపడిపోయినారు.

ఎప్పటికప్పుడు ఏదైనా అనుభవించిన క్షణంమాత్రమే మనదనుకొనే ఉమర్ ఖయ్యాం తత్వం తనది. ఇంటర్‌లో వుండగా యీలాంటిభావాలు కొన్ని అవ్యక్తంగా వున్నా బి. ఏ. లో చేరేనాటికి బాగా బలపడినయ్.

బి. ఏ. చదివినకాలమంతా తన జీవితేతిహాసంలో వొక మరుపురాని అధ్యాయం. అయితే తనపై దాని ప్రభావం యెంతవరకూ ప్రసరించిందనేది విచారణీయాంశం. అయినా యీనాడు తనలో యీ జిజ్ఞాస కలగడానికి అదే కారణమని తన దృఢనిశ్చయం.

దివారాత్రము లొక్కతీరుగా జీకించినది తను బి. ఏ. చదివేకాలంలోనే. అప్పట్లో తనకు ఆప్తమిత్రులైనవాళ్ళలో చక్రవర్తి, సోమయాజులు, సాంబావధాని, సూర్యం ముఖ్యులు - ఇప్పుడు వీరందరూ తలా వొక జీవితవిధానం నిర్ణయించుకున్నారు. చక్రవర్తి పెద్దగా ఆస్తిపాస్తులున్నవాడు కావడంవల్ల అతడికి కొన్ని బాధ్యతలు పైనబడినయ్. వాటితో సతమతమౌతున్నాడు. సోమయాజులు ఉన్నతవిద్యకై యింకా బనారస్‌లో చదువుతూనే వున్నాడు. సాంబావధాని దూరాన వున్నా, రైల్వే ఉద్యోగరీ సంపాదించినవాడు కావడంవల్ల ఏ దిగులూ లేకుండా గడుపుకుంటున్నాడు. సూర్యం స్వంత మేడలోనే కులాసాగా కాపరం చేసుకొంటున్నాడు. అతడికి ఉద్యోగం చేసి సంపాదించుకు తినవలసిన అగత్యం లేదు.

—అందర్నీ అభివర్ణించి తన విషయం ఆలోచించుకుంటే వో పెద్ద ప్రశ్నార్థకం యెదురౌతుంది. వారిలో నూర్యాన్ని మినహాయించితే మిగతా ముగ్గుకీ తనంటే ప్రాణమే. ఇప్పటికీ పెద్ద ఉత్తరాలు వ్రాస్తూవుంటారు. బహుశా ఇక్కడే వుండడంవల్ల కాబోలు సూర్యమంటే తన కంత మోజు లేదు.

ఆ రోజుల్లో అందరికీ తనే మార్గదర్శకుడు. ఇంట్లోనించి బయల్దేరేటప్పుడు జేబులో యేమివున్నదో తడుముకోవాల్సిన అవసరం ఆ రెండేళ్ళలో వొక్కనాడూ కలగలేదు.

—కాని అప్పటి తన అభిరుచులు, ఆచరణలు తల్చుకుంటే యిప్పటికీ మనసు సంబరపడుతూనే వుంటుంది. కాని, దాని వెనక యేదో విషాదం దాగివుండి ఇట్టే కబళించి వేస్తున్నట్టుంటుంది.

ఉదయం పదకొండు గంటలప్పుడు పకోటల్లో అడుగుపెట్టి కావాలని ఐస్ ఇడ్లీకి ఆర్డరీయడం అందరూ వొక్కసారి తన మొహాలకేసి వీళ్లెక్కడి మనుషులూ, అన్నంత వింతగా చూడడం, - కాలేజీ

# ★ స్వాగతంచెప్పిన తీర్పు ★

విద్యార్థులు, - అందులో తనలాంటివాళ్లు - చల్లారిపోయిన పదార్థాలు తినడంలో గల ఆంతర్యం, భవిష్యత్తులో వారికి కలగబోయే అభ్యుదయం గురించి చక్రవర్తి చెప్పే వ్యాఖ్యానాలు, - ఇంతలో ఒక గీతం సందర్భంగా అందుకుని ఆలపించే సోమయాజులు కంఠంలోని మాధుర్యం, ఈ గొడవలో తాము పడివుంటే మరో రెండు ఇడ్లీలకు ఆర్డరిచ్చి సాంబారుకలిపి పిసుక్కు తినే సాంబావధాని అమాయికపు తిండి పుష్టి, పెట్టిందంతా నోటకుక్కుకుని బిల్లు ఎవరు చెల్లించాలా అని గోళ్లుకొరుక్కుంటూ వెర్రిచూపులు చూసే సూర్యం తాలూకు అర్థంలేని ఆదుర్దా, తల్చుకుంటే యిప్పటికీ తనలో ఒక విలక్షణమైన భావకెరటం ఉదయిస్తూ వుంటుంది.

—రెండో ఆట సినీమా చూసి, సింగ్ కొట్లో మిఠాయి మేసి, రైలుకట్టకుపోయి యేవో రాద్ధాంతాలు, సిద్ధాంతాలు వల్లె వేసుకుంటూ తెల్లవార్చిన రాత్రులు ఎన్నో వున్నయ్. ఆ సముద్రపు గాలిలో సోమయాజులు గొంతెత్తి యెంకిపాటలు పాడుతుంటే కలిగిన విచిత్రానుభూతి యిప్పటికీ హృదయంపైన చెరగని ముద్ర వేసినట్టుంటుంది. చక్రవర్తి సలక్షణంగా పద్యాలు చదివి భావావేశంతో వ్యాఖ్యానిస్తూవుంటే యెంతసేపైనా చెవియొగ్గి వినాలనిపించేది తనకు.

—ఇంటికివెళ్ళి పడుకోవాలనే బెంగ యెవ్వరికీ వుండేదికాదు. ఘంటసాలవారి సత్రపు అరుగుమీద యిటుకరాళ్లు తలగడలుగా పెట్టుకుని నిద్రపోతూవుంటే పోలీసులు వచ్చి లాఠీలతో లేవగొట్టిన రోజులు యెన్నో వున్నయ్! కాని, క్రమంగా వాళ్లే తమకు పరిచితులై లేపడం మానివేశారు గాని, అలవాట్లకు భంగం రానీలేదు మరి!

—సంక్రాంతి రోజుల్లో షావుకారి అరుగుపైన చలికి ముడిచిపెట్టుకుని ఒకరినొకరు కావిలించుకు పడుకున్నప్పుడు కప్పుకోవడానికి గుడ్డయేదీ, అనే శంక రాగా, యెవ్వరికీ తోచని ఆలోచన తనకు తట్టింది. 'అండర్వేర్' మాత్రం సంపన్న గాత్రుడై, గూడకట్టుగా చుట్టిన పంచను మడతవిప్పి ఇటునించి అటుదాకా కప్పి ఒక సరికొత్త విచ్ఛదనాన్ని కల్పించాడు. అందరికీ కంటికి నిండుగా నిద్రపట్టించాడు. అందుకే కాబోలు, తెల్లగా తెల్లవారినా మత్తువీడక ప్రమత్తులై పడివున్నారు. ఇంటావిడ తలుపుతెరిచి చూడడంతోనే 'అమ్మయ్యో' అని విరుచుకుపడడం, తెలతెలా అందరూ అరుగుమీదకు రావడం, అప్పుడే చీపురుకట్టలతో వాకిళ్లు వూడ్వ వచ్చిన దాసీలు కొందరు చుట్టూ మూగడం, తమకు మెలకువరావడం ఒక్కసారే జరిగినయ్. అయిదుగురి గ్రాడ్యుయేట్లను వెలవరించిన ఆ ముసుగుచూసి యింటివాళ్లు విభ్రాంతులై ముక్కులపై వ్రేళ్ళు వేసుకున్నారు. కాని, ఇప్పటికీ తనకు మన్నా అయినవిభుల్లో అది ఒకటి.

- అవసరాన్ని అవకాశాన్ని బట్టి వేషాలు మార్చడంలో తనకు సాటిలేని నేర్పు వుండేది. నాగేశ్వరస్వామి దేవాలయంలో జరిగే సప్తాహాలకు అప్పుడప్పుడూ చాటుమాటుగా వెళ్లుతూవుండడం కద్దు. ఈ వేషంతో చొరబడితే తమకు మహాభక్తుల సరసన స్థానంవుండదని, వెంటనే వంకరమెడ సందులోకివెళ్లి, గూడకట్టువిప్పి బళ్లగోచీలుబిగించి సరాసరి గర్భగుడిలో చేరి అందరూకలిసి ఒక విభూతిపండుపగలగొట్టి దానిపై కానీఅంతేసి కుంకం మెత్తేవారు. ప్రసాదాలు పంచే సమయానికి కాయలు అంతకుముందే యిచ్చినట్టు నమ్మించి తలా ఒక కొబ్బరిచిప్ప సంగ్రహించుకుని బైటపడేవారు. తల్చుకుంటే యిప్పటికీ నవ్వువస్తుంది తనకు. - ఏదిచేసినా అవాడూ పరదా కింద జమకట్టబడి చెల్లిపోతూవుండేది. కాక, యిదంతా మోసమా? ఎవరిని మోసగించి నట్టు? భగవంతుణ్ణా? ప్రపంచాన్నా? ఏమో...తనకు ఇప్పటికీ సమాధానం దొరకదు. చిత్రమేమిటంటే 'అందరం కలిసి ఒక్క ఫొటో, దిగాలనే ఆలోచనే యెవ్వరికీ రాలేదారోజుల్లో - ఎవరికి వారే దూరమైపోయారిప్పుడు. పరీక్షల్లో సూర్యం తప్పాడు. తనను గ్రూపులో 'డీబైన్' చేశారు. చక్రవర్తీ, సోమయాజులూ తెలుగులో ప్యాసయ్యారు; సాంబావధానికి ఇంగ్లీషులో పోయింది. అయినా సెలవల అనంతరం మరెవ్వరూ రాలేదు; చదవలేదు. తనొక్కడే యిక్కడ మిగిలిపోయాడు. సూర్యంవున్నా తనతో కలియడు. అతడి బాకీ వడ్డీతో సహా తీర్చివేశాడు కూడా—

అదిమొదలు మిత్రులకోసం తనలో ఒక కొత్త ఆరాటం బయల్దేరింది. కాలేజీ విద్య చదివిన తనకు మిత్రుల కొరతఅంటే యెంత

రైనా నవ్వుతారు; కాని తన అంతర్యం పంచుకు తిరగగలవారు కావాలనే తహతహపడుతూ వుండేవాడు. ఏమీతోచక కర్తవ్యం యేమిటో పాలుపోక యెన్నాళ్లో రోడ్లవెంట తిరిగాడు; మరెన్నాళ్ళో వంకరమేడ సందుమొగలోవున్న దీపస్తంభం వెనక అరుగుపై కూర్చుని దరీ-అంతూలేని ఆలోచనల్తో కాలం గడిపేవాడు. ఈ ప్రపంచమంతా తనను వెక్కిరిస్తున్నట్టు, వెనక్కు నెట్టుతున్నట్టు అనుకుని కచ్చగా తనలో తనే తిట్టుకుంటూ వుండేవాడు—

బి. ఏ. తప్పినమొహం కావడంవల్ల ఇంట్లో ఆదరణ అంతమాత్రంగానే వుండేది. వారికసలు మొహం జూపడానికే సిగ్గై తప్పుకు తిరుగుతూ వుండేవాడు. గతకాలపు తన చిద్విలాసాలు అందరకూ తెలిసినవే. ఏదో సందర్భంలో సూటిగా మాటలు అంటూంటే అవి సరాసరి హృదయానికి తాకి పళ్లు బిగించుకుంటూ వుండేవాడు. కాని, కళ్ళల్లోమాత్రం దైన్యం తొణికిసలాడేది. ఇంతలో యింతటి పతనం తనకు సంభవించుతుందని ఏ నిశీధంలోనూ కలగనలేదు. మరేం జెయ్యాలి? అచ్ఛంగా తనకీ ఆలోచన ఇప్పుడే వచ్చినట్టుంది. సమాధానం కోసం సతమతమైనా వొక నిర్దిష్టమైన పరిష్కారమార్గం అందక, తెలియని నిరుత్సాహంతో క్రుంగి కుమిలిపోయేవాడు. ఒక్క గడియైనా యిక్కడ ఉండకూడదనే ఆవేశం రాగా, ఊరిబయటకుపోయి వచ్చి - పోయే రైళ్లను లెక్కవేసుకుంటూ కాలం గడిపేవాడు. అవన్నీ తమ కాళ్లకింద వలిగిన భూములే కావడంవల్ల అక్కడ కూర్చోగానే గుండెల్లో వొకవిధమైన గుబులు బయల్దేరేది. మనసు దేనికోసమో ఆరాటపడేది -

—ఈతీరున నాలుగుసంవత్సరాలపాటు - అంటే 1946 నుండి 1950 వరకు తను అజ్ఞాతయుగంలోనే గడిపాడు. పోయిన పరీక్షను పూరించుకోవాలనే ఉత్సాహం గాని, ఏదైనా చిన్న ఉద్యోగం చూసుకుని స్వతంత్రంగా బ్రతకాలనే వ్యక్తిత్వవాంఛ గాని తనకారోజుల్లో లేశమాత్రమైనా లేకపోవడానికి కారణమేమిటి? తన అన్వేషణఅంతా దేనికోసం? అలమందను విడిచిన లేగదూడలా యెన్నాళ్లు లక్ష్యం లేకుండా తిరగగలడు? తన ఆక్రందన వినేవారెవరు?- పొద్దు పొడుస్తూనే వుంది; చుక్కలు చూస్తూనే వున్నయ్. ఏపాటూ యెరగని తన అలసత్వం హరింపజేసే వెలుగుకిరణాలింతవరకూ ప్రసరించలేదు. కాలంచాటున తను నిదరోతూనే వున్నాడు—

—ఇంతలోనే తమ సంసారంలో పెద్ద మార్పులు వచ్చినై. 1950 అడుగుపెట్టగానే నాన్న ఇహం చాలించిపోవడం అన్నయ్యలిద్దరూ చెరివొక దిక్కుకూ వెళ్ళిపోవడం, ఇంటిదగ్గిర చదివే యిద్దరితమ్ముళ్లనీ, చదివినా సంసారం బాధ్యత గుర్తించలేని తననూ సాక్కురావలసిన భారం అమ్మ మీద పడ్డం జరిగినయ్. ఆమె అసహాయురాలు. ఈ యింటని యెలా చక్క దిద్దగలదు? పొలాలలో వచ్చే పంటైనా బహు స్వల్పం. అన్నయ్యలు నెలనెలా పంపే పైకంకూడా ఆపాటిదే. అన్నీ గ్రహించిన తను ఇక్కడ నిల్చి ప్రశాంతంగా యెలా గడపగలడు? అన్నం సయించేదికాదు; అమ్మ మొహంజూసినా, ఆమె పడే కష్టాలు తిలకించినా గుండె కోతగా కుమిలియేడ్చేవాడు చాటుకిపోయి. 'ఆమె యెవ్వరికోసం యీ పాట్లు పడుతున్నది?' అనే ప్రశ్న తనను వేధించసాగింది. అది పొటమరించడంతో కడుపులో చెయిపెట్టి కలచివేసినట్టయ్యేది. ఆమెను చాటుచేసుకుని యిలా మాగబ్రతుకు బ్రతకడమేనా? మరి తన ప్రయోజకత్వం యేమైనట్టు? నోటికివచ్చినట్టు తనను విమర్శించే లోకానికి యేమని సమాధానం చెప్పగలడు? ఏ ఆదర్శాన్ని సాధించడానికి తను పాటుపడుతున్నట్టు? ఆమాట తల్చుకోవడానికి తనకుగల హక్కు ఏపాటిది? ఆ పేరుతో ఆత్మవంచన చేసుకోవడం మినహా మరేమి నెరవేర్చుకున్నట్టు? ఇలాటి భయంకరమైన ప్రశ్నలు సుళ్లుతిరిగి తనను ముంచేస్తుంటే ఉక్కిరిబిక్కిరై గుక్కతిప్పుకోలేక గుడ్లు తేలవేసిన రోజులు లెక్కకు మిక్కిలిగా వున్నయ్—

—ఒక్కనాడొక్క అసురసంధ్యలో పార్కుకి బైలుదేరబోతూ వుండగా, పక్కయింటి ప్లీడరుగారు బిగ్గరగా కేకలు వేయడం విని, అదేదో ఆలకించాలనే ఉద్దేశ్యంతో దొడ్డిగోడ పక్కనవున్న సీతాఫలం చెట్టు కిందకు చేరాడు తను. ఆయన సహజంగా కోపిష్ఠి కావడంవల్ల యేదో విషయంపైన చిరాకెత్తి యిలా మొదలుపెట్టాడా, అన్న అనుమానం మొదట కలిగింది; కాని రాను రాను ఆయన మాటలధోరణి పరిశీలించితే తేలిన సారాంశం యిది - పెళ్ళైన ఆయన కూతుర్ని యికపైన చదివించాలా? వద్దా? అనే సమస్యపై ఆయనకీ భార్యకీ మధ్య జరిగే సంఘర్షణ, అని. ఎందుకనో ఆవిడకున్నపాటి అభ్యుదయభావం ఆయనకు లేకపోయిందా క్షణంలో. "ఉద్యోగం చెయ్యాలా? ఊళ్లేలాలా? ఇంతటితో చాలించుకుని, తగుపాటి సంబంధం ఖాయపర్చుకోవడం ఉత్తమం, అని చివరకు తేల్చివేశాడు - తనలాంటివాడు ఎవరిపై సానుభూతి చూపగలడు? ఈ ప్రశ్న ఉదయించగానే తిరిగి తన వ్యక్తిత్వం గుర్తుకువచ్చి, గుచ్చి విడిచినముల్లులా బాధించసాగింది. ఎటూ తీర్పు చెప్పమని లోకం తనను ప్రాధేయపడడం లేదుగదా! తనకుతానై వొక స్వతంత్రాభిప్రాయాన్ని కలిగివుండేపాటి ఆత్మాభిమానం లేనివాడా? అయితే యీ గుంజాటన యెందుకు? ఎందువలన ఒక నిశ్చయానికి రాలేకపోవడం జరుగుతున్నది? అంటే అంతర్గతమైన ఆలోచనాపటిమ బయటి వ్యక్తిత్వంపైమాత్రమే ఆధారపడి వున్నదన్నమాట! - అయితే తను మిత్రులతో పాటు తిరిగే ఆరోజుల్లో యెన్నిరాద్ధాంతాలు జరిపేవాడు? తనుచేసిన యెన్ని నిర్ణయాలు వారిచే వొప్పించడానికి పట్టుబట్టాడు? ఈనాడు తనకు లేని వ్యక్తిత్వం ఆనాడెలా వచ్చింది? అంటే బాధ్యత గుర్తెరగని వ్యక్తి తనపైన అలాటి వేవైనా ఆరోపించుకుని వ్యవహరించుతూ వుంటాడేమో...తనిప్పుడు గ్రహించింది బాధ్యతపైన వున్నదనేకాక తన్నిర్వహణకు తగిన ఉత్సాహాన్ని పూరించుకోగల తాహతు కూడా లేదు; అని.

—అయితే "ఉద్యోగం చెయ్యాలా? ఊళ్లేలాలా?" అన్న ప్లీడరుగారిమాటలకర్థమేమిటి? 'చదువు' అనేది ఉద్యోగంకోసమే ప్రత్యేకంగా యేర్పడివున్నదనీ, ఉద్యోగం చెయ్యలేనివాడు చదివీ, కూడా వ్యర్థమే అనీ ఆయన తాత్పర్యమై వుంటుందా?

భార్యా, భర్తా ఇద్దరూ సినిమా హాల్ లో కూర్చొని వున్నారు. అప్పటికింకా సినిమా ప్రారంభం కాలేదు. ఉన్నట్లుండి భార్యకు ఏదో జ్ఞప్తికి వచ్చింది: "ఏమండీ!... సినిమాకు వచ్చే తొందరలో, ఇంట్లో పొయ్యిలోని నిప్పులు ఆర్పేసి వచ్చానో లేదో అనుమానంగా వుందండీ" అంది.

భర్త తాపీగా "పర్వాలేదు... బాత్ రూంలో కొళాయి మరను తిప్పి — ఆపివచ్చానో లేదో నాకు కూడా జ్ఞప్తికి రావటం లేదు. అందుచేత ఇంట్లో మంటలు బయలుదేరినా కొళాయినీళ్ళు ఆర్పేస్తాయి లేవే!" అన్నాడు!!

—జి. వి. జి. కృష్ణ, మద్రాసు.



సింహావలోకనం

( మైసూర్ రాజభవన ప్రాంగణమున శిలానిర్మిత సింహావిగ్రహము )

కావొచ్చు కాని, తనకు తానే బాధ్యత వహించుకోలేని వ్యక్తి యెదటివారి ఆదర్శాన్ని పుణికిపుచ్చుకోవడం సాధ్యమా? కాకపోతే యేంచెయ్యాలి మరి? ఏమీ చెయ్యలేనివాడికి విషయవిమర్శతో వొరిగిందేమిటి? తను చేసేది విమర్శఅయితే ఏ ఫలితాన్ని ఆశించి మొదలెట్టినట్టు? తనే విమర్శించుకుని, తనే నిర్ణయించుకుని ఫలితం అనుభవించే వాడుకూడా తనేనా? అందుకు సిద్ధమైవున్నట్టేనా? ఉన్నా లేకపోయినా సహజంగా జరిగిపోయే వాట్లల్లో యేది కుంటుపడుతుంది? తనకు తెలియకుండానే తనను గురించిన కొన్ని నిర్ణయాలు జరిగిపోతే తనకేపాటి విభ్రాంతి కలుగుతుంది? నిర్ణయించిన వాడుకూడా తనే అయినప్పుడు ఏమౌతుంది? ఏమో... ఇప్పుడు చెప్పలేడు. బహుశా కార్యాచరణకు పూనుకోవడమే అప్పటి తన కర్తవ్యమౌతుందేమో...

—ఆనాటి అర్థరాత్రప్పుడు తను చేసుకున్న నిర్ణయంప్రకారం ఉదయాన్నే మొదటి రైల్లోపడి యీ ఘటాన్ని బెజవాడకు చేరవేశాడు. గడపలో అడుగుపెట్టగానే ఉత్తరం రాయకుండా ఇలా వచ్చావేమిరా అమ్మ యెలావున్నది, అంటూ ఆదుర్దాగా అడిగాడు పెద్ద అన్నయ్య. అతడు అప్పుడే మెడికల్ స్టోర్సు తలుపులు తెరచి, డ్రాయరుమీదవున్న కాయితాలు, అవి దులుపుకుంటూ కుర్చీలో కూర్చోబోతున్నాడు. తను వెంటనే మాటకుమాట చెప్పకుండా రెండడుగులు ముందుకు నడిచి ఇటూ - అటూ కలయజూడడం మొదలు పెట్టాడు. ఈసారి అన్నయ్యకు మరింత ఆదుర్దా హెచ్చింది. ఏదో రహస్యమో, మరి ప్రమాదమో జరిగివున్నట్టు, తను చెప్పడానికి జంకుతున్నట్టు అతడి ఆదుర్దావల్ల గ్రహించాడు తను. మిగతా విషయాలు వదిలి యీసారి అచ్చంగా అమ్మ కెలా వుంది అని గద్దించి అడిగాడు. తను ఎదురుగావున్న బల్లపైన కూర్చోబోతూ "అందరూ బాగానేవున్నారు" అన్నాడు అతి సహజంగా; ముక్తసరిగా.

"అయితే యిప్పుడెందుకు వచ్చినట్లు నువ్వు" అంటూ సూటిగా ప్రశ్నించాడు అన్నయ్య. "ఊరికేనే" అన్నాడు తాపీగా. అతను పాంటుజేబులోవున్న చేతిరుమాలు తీసుకుని మొహం తుడుచుకుని కూర్చున్నాడు.

"అయితే యింటికి వెళ్లు, వెళుతూ దార్లో వొక అరపౌను స్టేన్సు కాఫీపొడి పట్టుకువెళ్ళమని, రెండురూపాయల కాయితం యిచ్చాడు. అది తీసుకోబోయేటప్పుడు తనకు చేయివణికింది. కాయితం జేబులో పెట్టుకుంటూ మరోసారి అహాల్లో నాలుగువేపులకీ కలయజూశాడు తను. పలుగకాల మందుసీసాలు, ఫాన్సీ సామానులు, బిస్కట్లడబ్బాలు, పిప్పరమెంట్లు సాట్లాల దగ్గర్నుంచీ అన్నీ సమృద్ధిగా కంటికి నిండుగా కనబడుతున్నయ్. తనకేదో తెలియని తృప్తి కలిగింది. అన్నయ్య బెజవాడ



చాముండీ మెట్టపై "మహానంది"

ఫోటోలు: 'గోపాల్'

వచ్చి, మెడికల్ షాపు పెట్టి స్వతంత్రజీవనం సాగించడం మొదలెట్టాక తనిక్కడికి రావడం మొదటిసారి కాకపోయినా యీనాడు ఎందుకనో మనసు మరోకతీరుగా కొత్త ఆలోచనలు చేస్తోంది. రాత్రి తను చేసుకొన్న నిర్ణయమే అందుకు కారణమేమో... అన్నయ్యను ఏదో అడిగి తెల్సుకోవాలనే ఉత్సాహాన్ని పురస్కరించుకుని తనలో కలిగిన చొరవ కారణంగా వెంటనే యిలా అడిగేశాడు. "నేనీవూళ్లో ఉద్యోగం దొరుకుతుందేమో అని వచ్చాను" అని. 'అమ్మతో చెప్పావా?' అని వెంటనే అడిగాడు అన్నయ్య. అడిగేటప్పుడు అతని పెదవులపై మందహాసం మెరవడం తను కళ్ళారా చూశాడు. తను చెప్పేమాటను అంత చులకనగా లెక్కగట్టడంలో అతని ఉద్దేశ్యం మేమైవుంటుంది? తనలో పౌరుషం పడగయెత్తింది. మొహం గంభీరంగా పెట్టి ఇలా అన్నాడు. "ఇక్కడకు వస్తున్నానని మాత్రమే అమ్మకు చెప్పాను" అని. అన్నయ్యకుకూడా యీమాట వినడంతో మొహం ఆలోచనాయత్తమైనట్టయింది. "ఊహూ:—అన్నాడు వో క్రమాలకి. తిరిగి అతనే ఇలా అన్నాడు. "అయితే ఇంటికి పద, మిగతా సంగతులు మధ్యాహ్నం మాట్లాడుకుందాం. అంటూ కుర్చీలోనించి లేవబోయాడు; ఎవ్వరో తోలుసంచీ పట్టుకున్న వొక వ్యక్తి గుమ్మంలో అడుగుపెట్టి గుప్పున కొప్పెన్లా పొగవదిలి తన మొహంవంక పరకాయించి చూశాడు. 'ఇతను మా బ్రదర్' అంటూ అన్నయ్య తన నా వ్యక్తితో పరిచయం చేశాడు. తను ఇంటికి వెళ్లిపోతూ వుండగా తోలుసంచీ డ్రాయరుమీద పెట్టి తిరిగి పొగ వదిలాడా వ్యక్తి. ఆ ఘుమాయింపుతో మనసు రెపరెపలాడింది. అలనాటి స్మృతులు కొన్ని బాధించసాగినయ్.

—వదిన కొచియిచ్చిన కమ్మని కాఫీ చప్పరించుతూ ఇష్టాగోష్ఠిగా తన మనోవేదనంతా వెళ్లగక్కుకున్నాడు. ఆమెకూడా మరో గ్లాసులో కాఫీ నింపుకొని తీరుబడిగా తనను అన్నివిషయాలూ అడిగి తెల్సుకుంది. ఆమెదగ్గర యేవిషయమూ తను దాచలేడు. తనకు తొమ్మిదేళ్ల వయస్సప్పుడే ఆమె యీ యింట్లో అడుగుపెట్టింది. ఇప్పటికీ ఆమె తనను 'కృష్ణుడూ' అనే పిలుస్తుంది. ఆ పిలుపుతో శైశవం గుర్తుకు వచ్చినట్టవుతుంది. అమాయికంగా అన్నీ, చెప్పివేస్తాడు. "అయితే మీ అన్నయ్య ఏమన్నారు మరి?" అని అడిగిందావిడ. ఖాళీ అయిన కాఫీ గ్లాసులు రెండూ జత చేసుకుని పట్టుకు వెళ్ళబోతూ. "ఇంటికి వచ్చి చెపుతానన్నాడు" అన్న తన సమాధానం విని సాలోచనగా మొహం అటు తిప్పుకుంటూ ఊహూ - అని మాత్రం అని వెళ్ళిపోయిందావిడ——

# ★ స్వగతం చెప్పిన తీర్పు ★

—ఒక యస్. ఎల్. సి. ఫెయిలైనటువంటివాడు ఏపాటి పెట్టుబడితో వ్యాపారం సాగించగలడు? ఉద్యోగంకోసం యెగబడి ఇంటర్వ్యూలకు ఖర్చుచేసే డబ్బు పెట్టుబడిగా ఉపయోగించితే వొక వ్యాపారమే సాగుతుందని తలచాడు. ముఖ్యంగా, స్వతంత్రాభిప్రాయాలు, స్వతంత్ర జీవనం కావాలనే పట్టుదలతోనే మొదట్నించీ గడిపినవాడు కావడంవల్ల ఉద్యోగ ప్రయత్నం విరమించుకుని వ్యాపారంలోనే అడుగు పెట్ట సాహసించాడు. అయినా, తన పెట్టుబడి బహు పరిమితం. ఏమి కొనసాగుతుంది? అనే దిగులుతో తిరుగుతూనే మిత్రుడు ప్రతాపరావుగారితో గల పూర్వపు పరిచయం పునరుద్ధరించుకుని, తను ప్రారంభింపబోయే వ్యాపారానికి మూడు వంతులు పెట్టుబడి అతడిదగ్గర్నుంచి ఆకర్షింప గలిగాడు - ప్రతాపరావు అందుకు తగిన తాహతు కలవాడు కూడా. అయితే అతడొక బ్యాంకు ఏజెంటు. నిలకడగా వొకచోట నిలవగల తీరుబడి తక్కువ. అలాటివాడు పెట్టుబడి పెడితే యిదీ - అదీ నిభాయించుకు రాగలగడం సాధ్యమయ్యేదేనా? అనే సందేహం పొటమరించడంతో చివరకతడే తమాయించుకుని సలహా రూపంలో యిలా అన్నాడు. "నే నెలాగూ బ్యాంకు పనిమీద తిరుగుతూ వుండాలిగదా! దానితోపాటు మనకు సంబంధించినవాటిని కూడా చక్కదిద్దుకుంటూ వుంటాను. నీ విక్కడేవుండి అమ్మకం వగైరాలు సరిచూసుకుంటూ లెక్కలు నిర్వహించ"మని. అన్నయ్య అందుకు సమ్మతించి రంగంలోకి దిగాడు -

—అయితే ఇప్పుడతను అన్నయ్యపైన సర్వాధికారి. అన్నయ్యమక్కుకు సూటిగా వెళ్లాలనుకునే మనిషి. పెద్దవాడవడం మూలాన్న నాన్న తాలూకు నియిజాయితీ ప్రబుకు అతడికే ఎక్కువగా అలవాటు పడింది. వ్యాపారరంగంలో వొకరిచే మోసగింపబడకుండా మెలకువగా వుండాలనేదే అతడి ప్రధాన సూత్రం. అది ఆశయంగా వప్పుకోవడమే రోజురోజుకీ నేర్చుకుంటున్నాడు. అవసరము, అవకాశము జాగ్రత్తగా ఉపయోగించుకుని యెదటివారిని నొక్కిపెట్టాలనేదానికి అతడు ప్రయత్నించలేదు. అసలు చేతకాదేమోకూడా...

—ఒకనాడు గడపలో అడుగు పెడుతూనే ప్రతాపరావు అధికారకంఠంతో అరుచుకుంటూ అతనిపై విరుచుకుపడ్డాడు. సంగతేమిటో చెప్పకుండా యింత హఠాత్తుగా అతడిలా అయిపోవడానికి కారణం యెవ్వరూ చెప్పకుండానే అన్నయ్య గ్రహించి వెంటనే తన నిజాయితీ నడతను వివరిస్తూ సమాధానం చెప్పబోయాడు; కాని ప్రతాపరావు అది విన్పించుకోకుండానే తనలోవున్న కావేషాన్నంతా వెళ్లగక్కాడు.

—అన్నయ్య తన వ్యాపారాన్ని సర్వనాశనం చెయ్యడానికే దాపురించాడట. అవకాశం వచ్చినప్పుడు నాలుగురాళ్లు కూడదియ్యాలనే పరమరహస్యం గ్రహించలేని చవట యే రంగంలో దిగినా నీళ్లు గారుతూనే వుంటుందట. వేరొకచోట పదిహేను రూపాయలకిచ్చిన మందు, తను పదిన్నరకు మాత్రమే ఇయ్యడం హంతకుని చర్యతో సమానమైందట. ఇకముందైనా జాగ్రత్తగా తల ఉపయోగించుకుని మెలగగల్గితేనే ఇక్కడ వుండడం సాధ్యమౌతుందట!—ఇవి ప్రతాపరావు గర్జనలలోని మచ్చుతునకలు. ఆనాటినించీ యిద్దరూ ముభావంగానే వుంటున్నారట. తనపైన నిఘా అంతకంటే యెక్కువ అయిందట. కొద్దిరోజుల్లోనే తన వాటా కూడా కొనివేసే ఉద్దేశ్యంతో కొందరిని సలహా చెయ్యటం కూడా జరుగుతోందట. ఇదేదో నికరంగా తెలిసేవరకూ ఇక్కడ తను ప్రయత్నం చెయ్యడం పడదు. అందుకని హైద్రాబాదులో వున్న చిన్నవాడిదగ్గరకు వెడితే కొంత ఉపయోగించగలదని సలహా యిస్తూ కావలసిన పైకం యిచ్చి వెంటనే బయల్దేరమని తొందరచేశాడు. వదినకూడా అందుకు సమ్మతించింది—

—చిన్న అన్నయ్య చేరింది ఒక చిన్న ప్రభుత్వోద్యోగమే అయినా అతడి తెలివితేటలవలన, నిజాయితీవలన అధికారుల మన్ననలందుకుని చకచకా ఎక్కివచ్చాడు. తను అక్కడికి చేరుకొనేనాటికి అతడు డిప్యూటీతహసీల్దార్ హోదాలో ఉన్నాడు. అప్పటికి మూడోసంవత్సరం గడుస్తున్నా రెండు ఇంక్రిమెంట్లు పుచ్చుకున్నా యేక్షణమైనా అది పోతుందనే భయంకరమైనవిశ్వాసంతోనే చేసుకు వస్తున్నాడు. అతడు 'గైర్‌ముల్కీ' కావడమే అందుకు కారణం. తన సంగతంతా విని, జాలిపడి అతడు చెప్పింది ఇది—

ప్రభుత్వోద్యోగం సంపాదించడం బహు



"ఇంతకీ వాళ్లు విడాకులు ఎందుకు పుచ్చుకోవలసి వచ్చింది?"
"పెళ్ళి చేసుకున్నారు కాబట్టి"

* * *

చనిపోయిన భర్త సమాధిపై ఏదయినా మంచి వాక్యం ఒకటి చెక్కించాలని ఒకామె ఎంతో కుతూహల పడింది. రకరకాల వాక్యాలను పరిశీలించి తృప్తిలేక చివరకి ఇలా వ్రాయించింది. "అచిరకాలంలోనే నిన్ను కలుసుకుంటాను ప్రియుడా! అందాకా సుఖంగా ఉండు."

కష్టం. వచ్చినా శాశ్వతంగా నిలుస్తుందనే విశ్వాసం లేదు. అందులోవున్న సాధక బాధకాలు గ్రహించినవాడు కావటంవల్ల అది వదులుకుని ప్రైవేటు కంపెనీలలో ప్రయత్నించడమే మంచిదని సలహా యిచ్చాడు. అనుకున్నంతమాత్రాన అదైనా లభ్యమౌతుందా? ఎందర్ని ఎన్ని విధాలుగా సముదాయించుకురావాలి? ఎవరికివారే పెద్ద మనుషులుగా, నిజాయితీపరులుగా కనబడ్తారు. అయినంతవరకూ చొరవచేసుకువెళ్ళి సాహసించి సాధించుకురావడానికి తమను కొన్ని నైతికసూత్రాలు బాధించగలవు - అవేమిటో తనకంటే అన్నయ్యకే ఎక్కువగా తెలుసు - అయినా ప్రభుత్వోద్యోగంలోవుంటున్నవాడు తన హోదాను పురస్కరించుకుని యెవ్వర్ని ఎంతటివారిని తన పలుకుబడిలోకి తెచ్చుకోగలడు? మాట తభావతువస్తే తల తీసినట్లౌతుందిగానీ ... ఈతీరున మథనపడి, తనకోసం ప్రయత్నం చెయ్యడానికే నిర్ణయించుకున్నాడు చిన్నన్నయ్య —

—'భయంకరా కాటన్ మిల్సు'వారి జనరల్ మేనేజరు, ప్రొఫెసర్ 'రుద్రా' గారు ఆంధ్రులే. వారికి యిప్పటికీ అమలాపురం తాలూకాలో కొన్ని తోటలు, భూములు కూడా వున్నయ్! తండ్రులనాడే ఉద్యోగరీత్యా హైద్రాబాదుకు వెళ్ళి క్రమంగా స్థిరపడిపోయారు. తండ్రి పతంజలిగారికి సంస్థానంలో వున్న పలుకుబడివల్లనే ఇంతటి ఉన్నతోద్యోగం సంపాదించగలిగాడు రుద్రాగారు —

వారిది కడువిచిత్రమైన ప్రకృతి. బహుభయంకరమైంది కూడా. కాకపోతే తన అజమాయిషీ కిందవున్న మిల్లులో పనిచేసే వొక వ్యక్తి తనకు అల్లుడు కాగలిగివుండాలి అనే వాంఛ యెలాంటిది మరి? అలాటివాడికి భావినిర్ణేతలు కూడా తమరే కాగలరన్న మాట! అయినా యెవ్వరందుకు సాహసించి ముందుకు రాగలరు? తన కూతుర్ని పెళ్ళి చేసుకోగలనని హామీ యిస్తే ఉద్యోగార్హత కలుగుతుంది. ఉద్యోగం యివ్వబడితే మెడకు తాడు బిగించినట్టే. అయితే అందరిని వారలా అడగరు; తనకు నచ్చినవాడిని తప్ప. ఈ సంగతి విని అనుదినం యెందరో వచ్చి వెళ్లుతూవుండడం, వారు పెదవి విరిచి పంపుతూవుండడం అక్కడ జరుగుతున్న తంతు —

తనకోసం ప్రయత్నింపబోయే ముందు ఈ గాథ అంతా అన్నయ్యకు తెలుసు. అందుకే ముందుగా కొంత పస్తాయించి వూరుకుని వుంటాడు. కాని, తప్పనిసరి. అతడివెంట వెళ్ళే తను మాచాయగా యిదివిని మొదట కొంచెం కలవరపడ్డాడు. అయినా తనకలాటిఆశ లేదు. మాటలపొందిక చూసి మనసు రెపరెపలాడినా, నవ్వితే నాలుగడుగులు వెనక్కువెయ్యక మానరనే తనధీమా. అందుకనే ధైర్యంగా అన్నయ్యను అనుగమించాడు -

మేనేజరుగారిదగ్గర తగినంత పెంకెతనం కూడా వున్నది. ఆపాటి లేకపోతే యింత పెద్దసంస్థనెలా నిర్వహించుకు రాగలడు గనక!-తనను కొంతసేపు పరీక్షగా చూసి అన్నయ్యతో యేకాంతంగా మాట్లాడటానికని అవతలిగదిలోకి తీసుకువెళ్ళాడు. తనకు గుండెల్లో గతుక్కుమన్నట్లయింది. ఆయన అడగబోయే కొన్ని ప్రశ్నలకు సమాధానాలు సిద్ధంచేసుకోనేందుకై లోలోపల మథన పడుతూవుండగానే తిరిగి వారిద్దరూ యివతలికి వచ్చేశారు. ఆయన కుర్చీలో కూర్చోనబోతూవుండగానే అన్నయ్య గుడ్ బైకొట్టి వెడతామన్నట్టు కనుసైగచేసి తనతోపాటు బైటకు వచ్చేశాడు.

—సహజగుణం యెవ్వరూ అతిక్రమింపలేరు. అందరిలాగానే అన్నయ్యతో కూడా తన మనోగతం వెల్లడించాడు రుద్రాగారు. కాని, ఒక ప్రభుత్వోద్యోగి హోదాలో అతడేమీ సమాధానం చెప్పకుండానే ఇవతలికి వచ్చేశాడట. తనకిది ఆమోదయోగ్యమైతే రేపు సరాసరి రుద్రాగారి వద్దకు వెళ్ళవచ్చునన్నాడు. అయితే తనేం జెయ్యాలి? తన జీవితాన్ని గురించి సరియైన అంచనాలు వేసుకోవడం తెలియనివాడు, ఒక అజ్ఞాతవ్యక్తికి ఆత్మార్పణం కావించి బ్రతుకంతా బుగ్గిపాలు చేసుకుంటాడా? ఉద్యోగార్హత వేరు, జీవితేచ్ఛ మరోకతీరూను. ప్రొఫెసర్ రుద్రా నిజంగా శలయకారుడుగా కనిపించాడు తనకు—అన్నయ్యతో చెప్పి ఆమెన్నాడే అక్కణ్ణించి వచ్చేశాడు; బెజవాడలో దిగలేదు. ఇంటికి వచ్చి అన్నీ వివరించుకూ పెద్దన్నయ్య కొక ఉత్తరం మాత్రం వ్రాశాడు—

కాని, ఇదివరకటివలె ఇప్పుడు స్తిమితంగా కాలం గడపలేకపోతున్నాడు. హృదయంలో కలవరం యెక్కువైంది. ఏవీ తెలియనివాటికంటే తెలిసీ - తెలియనప్పటి పరిస్థితి మరింత దుర్భర మనిపించింది. అన్నయ్యలిద్దరినీ అర్థంచేసుకుంటే, జీవితం యెంత ఒడిదుడుకులతో నడిచిపోతున్నదో తెల్లమౌతోంది. ఒకరిక్రింద అణిగి ఉండకూడదనుకొనే పెద్దన్నయ్య ఏ పాటి తృప్తిని అనుభవించుతున్నాడు. ఉద్యోగం ఉంటే విషయమై ఒక నిర్ణయానికి వచ్చాక స్వతంత్రంగా ప్రాక్టీసు పెట్టుకోవాలనుకుంటున్నాడట చిన్నన్నయ్య. అయితే అదిమాత్రం నాటికి నూరుపాళ్లూ నిజాయితీగావుండగలదా? తనదగ్గరకువచ్చే యెన్ని క్లయింట్లలో గల న్యాయాన్యాయ విచక్షణచేసి స్వీకరించగల్గుతాడు? ఈ మెడికల్ స్టోర్సు సంగతి తేలిపోతే పెద్దఅన్నయ్య పని యేమౌతుంది? అయితే తనిప్పుడు చెప్పుకోవలసిన సమాధానం యేమిటి? వారిని చూసి గ్రహించగలిగిం దేమిటి? - ఇలా యెన్నిప్రశ్నలు వేసుకున్నా దరీ - అంతూ ఉండదు. కాలంచాటున యెలాటివైనా జరిగిపోతూనే వుంటయ్. దానికి కష్టం వెయ్యాలనుకునే తనలాంటివాళ్లు ఇలాగే ఇక్కడే - అణగారిపోతూ వుంటారు -

లోకమంతా కలగాపులగంతోనే కలిసి ముందుకుపోతూవుంటే తను వొక్కడూ నికార్సైన సరుకు వెలువరించాలనుకోవడంలో అర్థంలేదేమో... అయితే ఆ సంగతి అన్నయ్యలిద్దరికీ చెప్ప సాహసించలేదు. తనమటుక్కు తాను ఏమి నిర్ధారించుకోవాలి? అనేది ముందుసమస్య. - ఏదో చేసుకుంటాడు. ఎలాగో పడిపోతాడు. అదే తన దృఢనిశ్చయం - సిగరెట్టు ముట్టించి, చిన్నదీపం పెద్దచేసి, చివాల్న అక్కణ్ణించి బైటకు నడిచాడు. ★

# గెలుపు

## 1

జమీందారుగారు వయసులో వున్నారు. సాము గరిడీలు బాగా చేస్తారు. వేటలో మంచి ధైర్యసాహసాలు ఉన్నవారు. కండలు తిరిగిన శరీరం, మెలిపెట్టిన అతని కోరమీసం చూస్తే, ఎవరికైనా భయం వేస్తుంది. ఆ చుట్టుపట్ల గ్రామాలలో అతనితో సమానమైన బలంగలవారుగాని, ఆదాయం గలవారుగాని లేకపోవడంనుంచి, అతని మాటకు తిరుగులేకపోయింది. అతను ఆడింది ఆట, పాడింది పాట. అతను ఏ అత్యాచారాలుచేసినా, ప్రజలేమీ అనలేకపోయేవారు. ఒకరిద్దరు ముందుకు వచ్చినా సిగ్గులేకపోయారు. నోరుమూసుకొని, చూసీచూడనట్లు, ఏమీ సంబంధం లేనట్లు, అతని నిరంకుశత్వానికి ఎదురు తిరగలేక, అందరూ తప్పించుకొని తిరిగేవారు.

జమీందారుగారు ప్రజల సొమ్ముతో కోటగోడలు మరామ్మత్తు చేయించి, కందకం లోతుగా తవ్వించి, పూర్వం రాజుల కోటలవలె కట్టుదిట్టం చేశారు. అహోరాత్రాలు వంతులప్రకారం ద్వారపాలకులు కాపలా కాసేవారు. కందకం మీద వంతెన అవుసర మయేటప్పుడు ఉంచేవారు, లేనప్పుడు ఎత్తివేసేవారు.

జమీందారుగారికి విద్య తక్కువ. బలము, ధనము బాగా ఉండడంచేత మంచీ చెడ్డ ఆలోచించే జ్ఞానం నశించిపోయింది. ఇతరుల సొమ్ము అపహరించడం వినోదంగాను, పరస్త్రీలను చెరపట్టడం విలాసంగాను అతనికి ఉండేది. మానం, అభిమానం గలవాళ్లు మెల్లమెల్లగా అతనికి అందుబాటులోలేని దూరగ్రామాలకు వలసపోయారు. దీనులైనవారు అన్నిటికీ సహించి, చాల జాగ్రత్తగా తప్పించుకొని మసలేవారు.

ఒకనాడు జమీందారుగారు కోటవిడిచి ఊరిలోకి బయలుదేరారు. ఎండ కొంచెం కొంచెం హెచ్చుతున్నది. మెల్లగా గుర్రంమీద విలాసంగా స్వారీచేస్తూ, మీసాలు మెలిపెడుతూ, ఆయన వీథులవెంట వస్తుంటే ప్రజలు పక్కకు తొలిగిపోయారు. ఆడవాళ్లు ఇళ్లలో అణిగిపోయారు. తన ప్రభావానికి గర్విస్తూ, జమీందారుగారు కోమటివీథి ప్రవేశించారు.

మెల్లిగా కదంతొక్కుతున్న గుర్రం ఒక్కసారిగా ఆగిపోయింది. జమీందారుగారి దృష్టి ఒక యింటి డాబామీద పడింది ఒక అందమైన యువతి, చక్కటి నును వెచ్చటి చలికాలపు ఎండలో కురులు ఆరబెట్టుకొంటున్నది. జమీందారుగారు ఒక పావుగంటసేపు ఆమెను చూస్తూ శరీరాన్ని మరచిపోయారు.

అంతే! జమీందారుగారు కోటకి మరలిపోయారు. అతను వెళ్ళిన మరొక్క గంటలోనే ఆ అందమైన యువతి కోటలోకి చేర్చబడింది. వీధిలోవాళ్లు ముక్కులమీద వేళ్లు వేసుకున్నారు. వ్యాపారంమీద పొరుగూరికివెళ్లిన ఆమె భర్తతో ఈ విషయాన్ని చెప్పడానికైనా ఎవరికీ ధైర్యం చాలకపోయింది.

ఆ అందమైన యువతి భర్త కొంచెం వెలుగుండగానే యిల్లు చేరుకున్నాడు. ఇంటిముందు పూలముక్కలన్నీ పీకి వేయబడి ఉన్నాయి. ఇంట్లో వెండి బంగారాలు కనిపించలేదు. పట్టుబట్టలు మాయమయ్యాయి. దెబ్బలుతిని ఒకమూల పడివున్న తోటమాలి జరిగిన దురంతం చెప్పాడు. వైశ్యయువకుడి ఒళ్లు ఒక్కసారి ఉడికిపోయింది. ఒక్క క్షణమైనా వ్యర్థం చేయకుండా హుటాహుటిని కోటకు బయలుదేరాడు.

కోటదగ్గిరకి వైశ్యుడు చేరుకునేసరికి సాయంకాలం పడింది. కందకంమీది వంతెన ఎత్తివేయబడివుంది. పారాకాసే సిపాయిలు ఇతని కేకలకు నవ్వారు. కొంచెం సేపు వేచియుండమన్నారు. జమీందారుగారు అతిథులతో ఇష్టాగోష్ఠి సలుపుతున్నారని చెప్పారు.

వైశ్యయువకుడు ఓర్పుతో కందకం గట్టున కూర్చున్నాడు. చీకటిపడుతుంటే వంతెన దిగింది జమీందారుగారు వైశ్యుని చూడడానికి అంగీకరించారు.

జమీందారుగారి సేవకుల వేళాకోళపు నవ్వులు వినిపించుకోకుండా వైశ్యుడు కోటలోకి ప్రవేశించాడు. విశాలమైన లోపలి గదిలో జమీందారుగారు కూర్చున్నారు. పెద్ద వాలుకుర్చీలో బలువైన శరీరాన్ని చేరవేశారు. అగరుధూపం అంతటా క్రమ్ముకుంటున్నది. బంగారు ఆసవపాత్ర అతని ఎదుట బల్లమీద వుంది. జమీందారుగారు చాలా సంతోషంగా ఉన్నారు.

"నేను నీకేం సహాయం చేయగలను?" అని జమీందారుగారు వైశ్యుడిని ప్రశ్నించారు.

వైశ్యుడు నమ్రంగా వంగి, చేతులు జోడించి, కొంచెంసేపు ఆలోచించి, దృఢంగా, ఇలా అన్నాడు. "పరిహారాన్ని కోరడానికి వచ్చాను, ప్రభూ!"

జమీందారుగారు ఆశ్చర్యంతో లేచి కూచున్నారు. పెద్దగా నవ్వారు. "ఏమిటీ?" అని ప్రశ్నించారు.

వైశ్యుని నిశితమైన దృష్టి క్షణం మెరిసింది. మనస్సు కుదుటబరుచుకొని వైశ్యుడన్నాడు. "ప్రభువువారు నాతో పరిహాసం చేస్తున్నారు. తమ వంశము వారందరూ ప్రతిష్ఠవిషయంలో వెనుకబడవలసినవారు కారు. నా కోరిక తిమరు నిరాకరించరు."

ఆసవపాత్రలోని మద్యం కొంతత్రాగి, నవ్వు ఆపుకుంటూ జమీందారుగారు అన్నారు. "భేష్! మంచి మాటే! నాతో ద్వంద్వయుద్ధం చేయాలని వచ్చావన్నమాట! నువ్వు నష్టపోయినవాడివి. కాబట్టి నీకు నచ్చే ఆయుధాలు నువ్వేంచుకో. నువ్వు చెప్పిన షరతుల మీదనే యుద్ధం చేద్దాం. చూడు! అదిగో ఆయుధశాల. కత్తులా, బల్లాలా, ఈటెలా— ఏవి కావలిస్తే అవి ఎంచుకో!"

వద్దని సంజ్ఞచేస్తూ వైశ్యుడన్నాడు "ప్రభూ! ఇవన్నీ ఎందుకు? ఈ భయంకరమైన ఆయుధాలను నేను ఉపయోగించలేనని తమకు బాగా తెలుసునే. మీతో సవాలు చేసి ముక్కముక్కలుగా నరికివేయబడడానికి రాలేదు నేను. నన్ను తృప్తి

పరచాలని కోరితే నేను చెప్పే షరతులకు మీరు ఒప్పుకోవాలి ”

“నీ షరతులేమిటి?” అని జమీందారు గారు ప్రశ్నించారు.

రెండడుగులు ముందుకు వచ్చాడు వైశ్యుడు. “మొదటి షరతు—తమరు దయతో తమ శరీరాన్ని ఈ వాలుకుర్చీకి బలమైన త్రాళ్ళతో బంధించేటట్లు చేయాలి” అన్నాడు.

“నేనా ?—త్రాళ్లతోనా !...బంధింపబడాలా !..వీలులేదు.” అన్నారు కోపంగా జమీందారు గారు.

“క్షమించాలి ప్రభువులు. త్రాళ్లు సరిగా కట్టారో లేదో చూడడమే నాపని. తరువాత నేను కూడా మీరు మల్లే రెండో కుర్చీకి బంధింపబడతాను. ప్రభువువారి సేవకులు నమ్మకంగా నన్ను బంధిస్తారు - తమకీ విషయంలో సందేహం అక్కరలేదు.” అన్నాడు వైశ్యుడు.

“ఈఆట ఏమిటి?...నన్ను కట్టడమేమిటి? ...ఈ వెఱ్ఱి మొఱ్ఱి ఆలోచనలు మానెయ్!” అన్నారు జమీందారుగారు.

వైశ్యుడు స్థిరంగా చెప్పాడు “ప్రభువువారు, తమరే సెలవిచ్చారే - నష్టపడిన నేనే, ద్వంద్వయుద్ధానికి షరతులు నిర్ణయించవచ్చునని ప్రభువులు ఆడినమాట తప్పుతారంటే ఎవరు నమ్ముతారు. తమ సేవకులు నన్ను కూడా, మీలాగే, దృఢంగా బంధిస్తారు. నా చేతులు చూడండి ... ఈ బక్కచిక్కిన చేతులు త్రాళ్ళను తెంపుతుంటాయా? బంధించబడిన కోమటిని చూస్తే తమవంటి ప్రభువులకు భయం కలుగుతుందా?”

“భయం! అది కోమట్లు అనవలసినమాట”

“అవునవును. మనం ప్రస్తుతవిషయానికి వద్దాం. తమను గాయపరచాలని ఈవిధంగా కోరుతున్నాను. ప్రభువువారికి, తమను సమీపించేవారిని కొట్టడం బాగా...”

“పిరికివాడా!” అని జమీందారుగారు నవ్వారు. “నేను నీతో దెబ్బలాడితే స్వేచ్ఛగా నువ్వు నన్ను గాయపరచవచ్చు. నీమంచికే చెప్తున్నాను. ఈ తాళ్లబేరం వదిలెయ్! చేతులు కట్టివేస్తే ఎలా మాట్లాడవీలవుతుంది? నీకు నేను అభయమిస్తున్నాను కదూ! తాళ్లతో కట్టబడకపోయినా, నీ షరతుల ప్రకారమే నేను నడుస్తాను.”

“చిత్తం! చిత్తం! ప్రభువువారు నిజం సెలవిచ్చారు. తమ మనస్సయితే మంచిదిగాని, అలవాటు మాత్రం చాల తీవ్రమయినది. దానిశక్తి ఇటువంటి అభయాలనన్నిటినీ అతిక్రమించుతుంది. తమ చెయ్యి అలవాటు ప్రకారం నా పైకి వస్తే, ఆడినమాట తప్పడానికి కారణమైన చేతిని ప్రభువులు ఖండించవచ్చు, కాని నేను ప్రమాదంలో పడతాను. ఈ భవనంయొక్క కిటికీలు కందకంపై చాల ఎత్తునఉన్నాయి. గంతి పైకి పారిపోవడానికి కూడా వీలులేదు.”

జమీందారుగారు నవ్వారు. “అది నిజమే! కందకంపైన నూరడుగులు ఎత్తులో ఉన్నాయి కిటికీలు. నీకీ బాగా బాగా తెలుసు - పాతవాడివి కదూ! ఈ హాస్యం చాలా బాగుంది. నీ ఇష్టప్రకారం బంధించబడడానికి ఒప్పుకుంటున్నాను. కాని ఒక్క సంగతి. ఈ ద్వంద్వయుద్ధం చాల కాలం జరుగకూడదు కాళ్లు చేతులు కటివేయబడ్డ కోమటితో కాలం వ్యర్థంకాకూడదు. నేను కోరే ఆనందం నాకోసం ఎదురుచూస్తున్నది.”

ఈ ఆఖరువాక్యంయొక్క అంతరార్థం గ్రహించినట్లు వైశ్యుడి ముఖం బయటపెట్టలేదు.

జమీందారుగారు జబ్బ చరిచి, కన్నుగీటారు. “ఒక్క గుక్కెడు ద్రాక్షాసవం త్రాగడానికి అనుమతిస్తావుకదు, కోమటీ! అది త్రాగితే కావలసినంత ధైర్యంవస్తుంది. నీకుకూడా కొంచెం కావాలా?”

“ప్రభువారు క్షమించాలి. నాకు కొంచెం మంచినీరు చాలు.”

“నేను ద్రాక్షాసవం త్రాగుతాను. ఈలోగా నీ ఏర్పాట్లు నువ్వు చెయ్యి”

జమీందారుగారు రెండుసార్లు పాత్రను ఆసవంతో నింపి ఖాళీచేశారు. తరువాత వైశ్యుడు జాగ్రత్తగా సేవకులచేత జమీందారుగారిని తాళ్లతో కట్టించాడు. చేతుల చుట్టూ మూడుసార్లు తాడు తిరిగింది. శరీరం అంతటినీ ఆ పెద్దకుర్చీకి వేసి కట్టేశారు. వైశ్యుడు తాడు ముడులను స్వయంగా లాగి చూసి, వదులుగా ఉన్నవాటిని గట్టిగా వేయించాడు. జమీందారుగారికి సరిగా మూడడుగులు దూరంలో ఎదురుగా కుర్చీ మీద కూర్చుండి అవిధంగానే త్రాటితో తన శరీరాన్ని సేవకులచేత కట్టించుకున్నాడు. వదులుగా కట్టకుండా, జమీందారుగారిని బంధించినవిధంగా, గట్టిగా తాళ్లను కట్టమని సేవకులను హెచ్చరించాడు. జమీందారుగారితో సమమైన గౌరవాన్ని పొందినందుకు చాలా సంతోషించాడు.

తరువాత దీపాలు వెలిగించారు. వైశ్యుడి కోరికమీద, ప్రొద్దుటివరకు, ఎంత గలభా జరిగినా, ఎవరూ లోపలికి రాకూడదని జమీందారుగారు సేవకులను ఆజ్ఞాపించారు. వినయంగా సేవకులు వెళ్ళిపోయారు. తలుపులు మూసుకున్నాయి. పదధ్వని అంతరించింది. ద్వంద్వయుద్ధం చేసే యోధులిద్దరూ మిగిలారు.

* * *

## 2

అప్పుడొక అసాధారణమైన సంఘటన జరిగింది. మహా బలశాలియైన జమీందారు, భయమెరుగని జమీందారు, అకస్మాత్తుగా కృంగినట్లు, ఎడారిమధ్య విసరివేయబడ్డట్లు, ప్రపంచం అంతటిచే విసర్జించబడినట్లు బ్రతికినవాళ్ళ జాబితాలోంచి పేరు కొట్టివేయబడినట్లు, ఊహించుకొన్నాడు. దీపాల రెపరెపల సూక్ష్మధ్వని కూడా ఆ గభీరమైన నిశ్శబ్దంలో మరణశయ్యమీద ఎదురుచూచే ఆఖరు గడియలను జ్ఞాపకం తెస్తున్నాయి.

బలవంతంగా వచ్చిన చలనరాహిత్యము, తన శరీరంమీదనే తనకు పోయిన స్వతంత్రము, కదలిక లేని, జీవంపోయిన కళేబరాన్ని అతనికి జ్ఞాపకం తెచ్చాయి. అతని శరీరం ఒక్కసారి వణకింది.

జమీందారు ధైర్యం తెచ్చుకొని, వేళాకోళంగా చిరునవ్వు నవ్వి, వైశ్యునివేపు చూచాడు.

కాని ఎదురుగా బంధింపబడిన కోమటిని చూచేసరికి, జమీందారు నెత్తురు గడ్డకట్టుకుపోయింది. యమధర్మరాజులా కనిపించాడు కోమటి. తనలోగల తక్కువదనం అంతా, జమీందారుపై గల మర్యాద అంతా, వైశ్యుని ముఖంలోంచి తొలగిపోయింది. అతని చిన్నకళ్ళలో ఒక తీవ్రత, ధైర్యమూ ప్రకాశించాయి. మాపులు జమీందారు శరీరాన్ని కొలిచాయి. ఎన్నిటిలోనో జయంపొందిన యోధుడివలె, ప్రతికక్షిని జయించేక్షణంలో ప్రయోగించే అస్త్రంలా వాడిగా చూచాడు.

జమీందారు తన సేవకులను పిలువవలసి వంతవరకు వచ్చింది.

“ఇంకా ఆలస్యమేమిటి! ఓకోమటీ!” అన్నాడు జమీందారు. ఒకొక్కమాట నోటిలోంచి బలవంతాన ఊడబెరికిన పన్నులా బయట పడుతున్నది. “నాకు నిద్రవస్తున్నది. ఒకసారి నిద్రపోయానా ఈకోటలోని ఫిరంగులన్నీ కాల్చినా తెలివి రాదు. నన్ను గాయపరుస్తానన్నావు తొందరపడు.”

“అదే! అదే! దానిగురించే నా ప్రయత్నం” అని సంతోషంగా వైశ్యుడన్నాడు. కళ్లతో

# ★ గెలుపు ★

కన్నా నిర్విచారంగా కనుపించాడు. ఆలోచించి మాట్లాడినతరువాత ఒక నిశ్చయానికి వచ్చాడు. సర్వస్వతంత్రుడిలా వ్యవహరించాడు.

"నువ్వు, నువ్వు నా భార్యను ఎత్తుకొచ్చావు. ఈ విజయానికి చాలా గర్విస్తున్నావుకదూ! ఇదేమైనా బాగుందా?... నేనే జమీందారునైతే అందమైన పెళ్ళికాని పడుచును సంపాదించి, ఆమెతో కొంతకాలం సుఖంగా గడిపి, విసుగెత్తిన తరువాత ఎవరికో ఇచ్చివేస్తును. కాని నువ్వు అటునుంచి ఇటు చేశావు. నేను అనుభవించినదానికోసం చెయ్యి జాచావు. నా ఎంగిలికోరడం నీకు ఇష్టం కాబోలు! కానీ! ఉంచుకో!"

జమీందారు నవ్వాడు. "చాల సంతోషించానోయ్! దొరికిన వస్తువేమీ చెడ్డది కాదులే! దానిని ఇంకా పొందడమే జరగలేదు."

"అవును స్వామీ! అవును! మీలాంటి వాళ్ళు పోయి, వయస్సులో ఉంటే కన్యలను, వారి తల్లిదండ్రుల అనుమతిపొంది తెచ్చుకుంటాము. పెళ్ళిచేసుకుంటాము. ఈ ఎత్తుకొని రావడము, బలాత్కారం చేయడం, ప్రలోభపెట్టడం మేము ఎరుగము. ఆ తరువాత మీ పన్నాగాలు మొదలవుతాయి. పువ్వులు, పళ్ళు, ఆభరణాలు కానుకలుగా పంపి, ఆడువారిని వశం చేసుకోడానికి ప్రయత్నంచేస్తారు. ఈ అనుభవింపబడిన ఆడవాళ్ళని, ఈ వాడుకలో లేని నాణాలను కోరుతారు. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది, ఇది మీ వంశమర్యాదా లేక మూఢత్వమా?"

"ఓ కోమటీ! నీ పేలాపనలు సహించలేను. నే నిచ్చిన అభయం తెల్లవారితే అయిపోతుంది."

"అప్పుడే దెబ్బతగిలిందా? నా కసితీరా గాయం చేయాలని అనుకున్నానే. అప్పుడే ళ్లు తెంచుకోడానికి తొందరపడుతున్నావు. నువ్వొక్కడివే చేతులతో పోట్లాడే మనిషివి కాబోలు!"

"ఓరి పిరికిపందా! నా కుడిచేతికే కట్లు లేకపోతే నువ్వు ఈసరికి పాదాలు పట్టి శరణువేడవా?" అన్నాడు జమీందారు.

వైశ్యుడి ముఖం ప్రకాశించింది. కంఠస్వని గంభీరంగా వెలువడింది. గ్రద్ద, ముక్కుతో పొడిచినట్లు, ప్రతికక్షిని గాచాడు.

"నన్నెందుకు పిరికిపంద అని పిలుస్తావ్! నేనూ నీకు మల్లే బంధింపబడలేదూ? నిజం నిర్మొహమాటంగా చెప్పడంలేదా? ఇది పిరికితనమా? రక్షణలేనివాళ్లను, గొలుసులతో కట్టబడినవారిని, హింసించని నీ పూర్వికుడెవడైనా ఉన్నాడా? సైనికులు తిరుగుబాటు చేస్తారని భయపడి పీడించని నీ పూర్వికులెవరైనా ఉన్నారా? మీ జమీందారు లందరూ రైతులను కొరడాలతో కొట్టించి పంటలు వసూలు చేయలేదా? వర్తకుల సొమ్ము అపహరించలేదా? ఆ సొమ్ము జూదంక్రింద, త్రాగుడుక్రింద పాడుచేయలేదా? అనాథులైన జనులనుండి రక్షించుకోడానికి సాయుధబలాలను చుట్టూ కాపుంచుకోలేదా? ఇటువంటి తరగతికి చెందిన పిరికిపందలే నీ వంశమువారంతా!...మరి నువ్వు..."

"నా వంశంగురించి ఇక ఒక్క మాట అన్నా చంపేస్తాను" అని కోపంతో గర్జించాడు జమీందారు.

వైశ్యుడు నవ్వాడు "ఎప్పుడు?...రేపు ప్రొద్దున్నా?...నేను తప్పకుండా నమ్ముతాను. రేపు నేను రక్షణలేని సాధారణ వైశ్యుడిని. నువ్వు సైనికులమధ్యనుండే జమీందారువి. కాని ఇప్పుడు మనం ఇద్దరం సమమైనవాళ్ళం. ఎందుకిప్పుడు నిస్సహాయుడవవుతావు? నేనేమీ నీమీద ఆయుధాలు ప్రయోగించలేదే!...నాకు సహాయంగా సేవకులెవరూ లేరే......అయినా నువ్వు బోనులో పడ్డ కోతిలా గెంతుతున్నావు... పళ్లు కొరుకుతున్నావు ఎంత పిరికివాడివో ఇప్పటికైనా గుర్తించావా?"

వైశ్యుడిమాటలు పెదవులు దాటి దాటకముందే జమీందారు ఒక్క ఊపుతో కుర్చీని ముందుకు తెచ్చాడు. రెండు కుర్చీలు దగ్గరపడ్డవి. భయంతో వైశ్యుడు వెనుకకు వాలిపోయాడు. జమీందారు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ముఖానికి తగులుతున్నాయి. జమీందారు బలమైన చేతులు కట్లలో మెలిబడుతున్నాయి.

కాని ముడులు సడలలేదు.

వైశ్యుడు కొంచెం తెప్పరిల్లాడు. ముఖం కందగడ్డలా మారిన జమీందారుచెవుల్లో అన్నాడు "ఓ పశువా! నీ కోపంతో నువ్వు ఉక్కిరి బిక్కిరి కావాలి!"

జమీందారు కొంచెం మనస్సు కట్టుబాటులోకి తెచ్చుకున్నాడు. వినీ వినపడకుండా, పళ్లు కొరుకుతూ గొణిగాడు. "ఓ కోమటి! చాలా విచారకరమైన సంగతి. రేపు నీ గతి ఏమవుతుందో తెలియకుండా ఉన్నావు."

"నాగురించి విచార మెందుకు. ముందు ఈ అర్ధరాత్రి నీకు దెబ్బ తగులక మానుతుందా?" అన్నాడు నవ్వుతూ వైశ్యుడు.

"హత్య! రక్షించండి!!" అని అరిచాడు జమీందారు. ఈ అవమానం భరించలేకపోయాడు. ఆ పేనుని, ఆ నల్లిని, నలిపివేయడానికి రెండు వేళ్లు కూడా కదపలేకపోయాడు. పొంగిపోయే కోపంతో గొంతుక బిగుసుకుంది. తన ముఖంమీద వాలిన వైశ్యుడిముఖంవల్ల తిరుగకొట్టబడి, పసిపిల్లడివలె ఈ రాక్షసుడు కొట్టుకున్నాడు.

"ఇప్పుడు పిరికిపందలెవరో తెలిసిందా" అని వైశ్యుడు జమీందారుచెవిలో అరిచాడు "కాళ్ళు చేతులు కట్టివేస్తే ఎంత సుఖముంటుందో ఇప్పుడు తెలిసిందా?... నిస్సహాయంగా బాధింపబడడం అంటే తెలుస్తున్నదా?... మనుష్యులను గొలుసులతో కట్టి కొరడాలతో కొట్టుంటే, వాళ్ళు పిల్లలలాగ ములుచుకుపోవడం తెలుస్తుందా? ములుచుకో! నువ్వే, నీ నోటితోనే, ఎవరినీ రావద్దని ఆజ్ఞాపించావే! నువ్వు ఊపిరితిరగకుండా చావాలి. నీ పొగరు అణచివేస్తాను. ఒక్క తుపాకీ అక్కరలేదు. ఒక్క సైనికుడు అక్కరలేదు. సమానమైన పరిస్థితులు...అప్పుడే, అప్పుడే నల్లబడిపోతున్నావ్!...కానీ..."

తాళ్లు తెంపుకోడానికి జమీందారు అమానుషమైన ప్రయత్నం చేశాడు. కుర్చీ ముక్కలు ముక్కలుగా విరిగిపోయింది. జమీందారు నిలబడ్డాడు కట్టముక్కలు ఒంటికి వేలాడుతున్నాయ్!

వైశ్యుడు పెద్ద అరుపు అరిచాడు. భుజాలమధ్య తలదాచుకొని మృత్యువుకోసం ఎదురుచూచాడు.

కాని దెబ్బ తగులలేదు. జమీందారు చుట్టూ తిరిగి గాలికి పిడికిళ్లుపట్టి, విరిగిన కుర్చీబల్లలమధ్య కూలిపోయాడు.

బయట కోట నగారా మ్రోగి అర్ధరాత్రిని సూచించింది.

మరికొన్ని గంటలు గడచిన తరువాత సేవకులు తలుపులు కొట్టి, కొట్టి జవాబు పొందలేకపోయారు. తలుపులు పగులగొట్టి లోనికి ప్రవేశించారు. దీపాలు ఆరిపోయి ఉన్నాయి. ప్రాతఃకాల వాయువుకి ముఖంమీది ముంగురులు ఎగురుతుంటే గుఱ్ఱుపెట్టి, కుర్చీలో నిద్రపోతున్నాడు వైశ్యుడు.

వైశ్యుని పాదాలదగ్గిర, జమీందారు సాగిలబడి, చచ్చి పడివున్నాడు. ★

ఆంగ్లకథకు అనుకృతి—'ఆనందవర్ధన'

# నీళ్ళపాలు

సుంకర సూర్యనారాయణ

"పాలల్లో నీళ్ళుపోసినా, నీళ్ళల్లో పాలు పోసినా ఒకటే" అన్నాడు రాము.

అందరు పక్కున నవ్వారు. రాముకు కోపంవచ్చి జేవురించినకళ్ళతో "కాదేం" అన్నాడు.

"అవును లే...!" అని వ్యంగ్యంగా అనేసి సీరియస్‌గా ముఖం పెట్టేసి కూర్చున్నాడు కేశవ.

"కాని..." అని చిరునవ్వు ఆపుకోలేక అన్నాడో లేదో కేశవ, "యేం" అన్నాడు. రాము తెలివితక్కువతనం బయటపెట్టడం కోసం ఏమీ తెలియనివాడిలా కేశవ "యేం" అన్నాడని అందరూ గ్రహించారు.

"నీళ్ళల్లో పాలు పోయటమంటే పాల వాటా తక్కువ, పాలల్లో, నీళ్లు పోయటమంటే నీళ్ళవాటా తక్కువ." కేశవ దీర్ఘం తీస్తూ అన్నాడు. రామూ అవమానం పట్టలేక తోక త్రొక్కిన త్రాచులాగ బుసలు కొట్టసాగాడు.

అవమానం, ఆగ్రహం మిళితమై అతని ముఖం వివర్ణమైంది. అగాథంలో మునిగిపోతూ బ్రతుకాలనేఆశతో విధితో పెనుగులాడే మానవునిలా బాధపడ్డాడు. తిరిగి ఉండబట్టలేక కాటువేసేటట్టు ఇలా అనేశాడు.

"మనమిట్లా ఉండబట్టే మన నాయకులట్లా ఉన్నారు. ఆంధ్రనాయకులు హైదరాబాదు ఆంధ్రనాయకులపై సవారీచేయాలని, హైదరాబాదు ఆంధ్రనాయకులు ఈ ఆంధ్ర నాయకులపై సవారిచేయాలని ఎత్తులు వేస్తున్నారు. అయితే ఒకరిజుట్టు ఒకరికి అందేట్లుగా లేదు. మనము హైద్రాబాదు తెలుగు ప్రాంతాన్ని ఆంధ్రలో కలిపి విశాలాంధ్ర కావాలంటున్నాము. ఇది సమంజసమైన వాదమైనా, దీన్ని వ్యతిరేకించేవారు లేకపోలేదు. ఆంధ్రలో హైద్రాబాదు తెలుగు ప్రాంతాన్ని కలిపితే నీళ్ళల్లో పాలు కలిపినట్లేననీ, ఆంధ్రులు హైద్రాబాదీయులపై సవారి చేస్తారనీ, ముస్లిములకు వారి భాషకు, మతానికి గొడ్డలిపెట్టనీ మూర్ఖవాదనలు లేవదీశారు. మరికొంతమంది 'మేము ఆంధ్రలో కలవము, ఆంధ్రులనే మాలో కలవమనండి' అన్నారు. ఇది మరీ మన్యప్రాంతీయులలో కొంతమంది వాదన. ఇది వింటే నవ్వు, తలకాయనొప్పి రెండూ వస్తాయి."

మళ్ళి యీ విధంగా మొదలుపెట్టాడు రాము.

"ఆంధ్రను హైద్రాబాదులో కలిపినా, హైద్రాబాదును ఆంధ్రలో కలిపినా తేడా లేదని నా వుద్దేశ్యం. అయితే ఆర్థికచిక్కులు కొన్ని వున్నాయి. 'ఫజలాలీకమీషను' బెజవాడ వచ్చినపుడు కళా వెంకట్రావు, కాశీశ్వరరావు ప్రభృతులు ఒక నివేదిక సమర్పించారు. అందులో హైద్రాబాదుకు ఎట్టి నష్టమూ రాకుండా ముందు కట్టుబాట్లు చేసుకోవచ్చని సూచించారు."

"ఇంకో శ్రీబాగ్‌పాక్ట్ అన్నమాట" అన్నాడు కేశవ.

"హై—"

"ఆఁ. నా దొక్కమనవి"

"ఏమిటి" సీరియస్‌గా అన్నాడు రాము.

"పాలల్లో నీళ్ళుపోసినా, నీళ్ళల్లో పాలుపోసినా ఫలితమేమిటి?"

"నీళ్ళపాలు"

"అదే నే చెప్పబోయేది. నామమాత్రానికి తగువులెందుకని. ఆంధ్రను హైద్రాబాదును కలిపి 'విశాల హైద్రాబాదు' అని పేరు పెట్టమంటున్నారు కొందరు మహాత్ములు!"

"ఇది మరీ వింతవాదం!" అని ముక్కుమీద వేలేసుకున్నాడు శంకరం.

ఆలోచనతో చెప్పినట్లుగా కన్నులు చిన్నవి చేసి "మీకు కోపంరాకుండావుంటే ఒక్కటి మనవిచేస్తాను" అని కేశవు అనేటప్పటికి 'ఫ్యూరియస్' గా "ఏమిటి" అన్నాడు రాము.

"ఎవ్వరికీ తగాదా లేకుండా ఆంధ్ర హైద్రాబాదులను కలిపి 'ఆంద్రాబాద్' అని నామకరణం చేస్తే?"

అంతా నవ్వారు. "జిందాబాద్" అనేశారు ఏకకంఠంతో.





గేదెల స్నానఘట్టం



ఫొటో: శ్రీ లంకరాజు మురళీధర.




# ఆడమాటలు



ఈమధ్య ఒక స్థానిక వార్తాపత్రిక 'స్త్రీల అభిప్రాయాలు' అని అర్థము వచ్చునట్లుగా '*Feminine opinions*' అని ప్రకటించింది. స్త్రీల కార్యక్రమాలలో స్త్రీల అభిప్రాయాలను ప్రసారము చేస్తున్నామని రేడియో నిలయమువారు ప్రకటించిన సందర్భముది. ఒకసారి పత్రికనుచూసి అవతలపడేసినవాళ్లు స్త్రీల అభిప్రాయాలనే అర్థము తీసుకొన్నారు. కొంతమంది ఆ మాటలో ఉన్న అర్థాన్ని వ్యాకరణపరంగా తర్కించి తర్కించి 'ఆడమాట' అని అర్థము వచ్చునట్లుగా సందేహించి రేడియో కార్యక్రమాలలో పాల్గొనే వనితాలోకానికంతకూ క్షణకాలములో వెల్లడించారు 'చూశారా! మనము ఇచ్చిన ప్రసంగాలన్నీ ఆడమాటల క్రింద జమకట్టారు!' అని.

ఒకదానితో ఒకటి అతకక పొత్తు కుదురని వాటిని - సత్యదూరములైనవాటిని - ఆధారములేనివాటిని - మాయమాయగా ఉండేవాటిని ఆడమాటలంటారు. కొంత దాన్ని గంపంత చేయటాన్నికూడా ఆడలక్షణం క్రిందనే జమకట్టారు.

నిజానికి ఆ పత్రికకుగాని ప్రకటన కర్తలకుగాని ఈ ఉద్దేశ్యము కలిగిఉండదు. కాని అందరూ సర్దుకొని ఊరుకుంటారా? అందరూ ఏకమై ఆ పత్రికమీదగాని - ఆ ప్రకటనదారుమీదగాని వ్యాజ్యము వేయటానికి తమకు ఉన్న అవకాశాలనుగురించి చర్చించుకోవటము మొదలుపెట్టారు.

మాట్లాడటములోగాని వ్రాయటములోగాని కొత్తసందు దొరికితే ప్రమాదకరమైన అర్థాలు తీయటానికి అవకాశాలు ఏర్పడుతాయి. ఒకసారి పదిమంది స్త్రీలు కూర్చుని

## ఇల్లిందల సరస్వతీదేవి

మాట్లాడుతూ 'మా అమ్మాయిని నైజాముకు ఇచ్చాము'అని. అనుకుంటున్నారు. వాళ్ల ఉద్దేశ్యము 'అమ్మాయిని నిజామురాష్ట్రములో ఇచ్చాము'అని కాని హైదరాబాదు నవాబుల చరిత్రలు తెలిసినవారు ఈ పైమాటలు వినటము తటస్థపడితే అట్లా అనుకోరు. ఎందుకంటే హైదరాబాదు నవాబులకు అందకత్తెలను బహుమతిగా అందుకొనే ఆచారాలున్నాయి. యువతులకు పినతల్లులు మేనత్తలు ఈరకపు బహుమానాలను చేస్తూ ఉంటారని వినికిడి. ఈదృష్టితో ఆ పైవార్త వింటే ఎట్లా ఉంటుంది?

సామాన్యముగా ఏవిషయములోగాని 'ఆడ' అన్న విశేషణము గల ప్రతివాక్యానికి హేళనతో చేరిన అర్థము 'తక్కువరకముది' అని ద్యోతకమయ్యే పరిస్థితులేర్పడ్డాయి.

సాధారణముగా కొత్త కీచుగొంతు వినబడగానే ఆడగొంతు అంటారుగాని సన్నటిదని ఎవరూ అనరు. ముఖ్యముగా మగవాళ్ళకు కంఠధ్వనిలో గాంభీర్యమూ అధికారమూ లేకపోతే ఆడగొంతు అనేస్తారు. దేహముకూడా బలిష్ఠముగా కండలుదేరి ఉండకపోతే పురుషుడికది లోపముగానే ఎంచుతారు.

ఏ స్త్రీకయినా కంఠస్వరములో కొంత గాంభీర్యము కనబడగానే 'మగవాడి గొంతులా ఎంత కటువుగా ఉన్నదో!' అంటారు. దేహముకూడా అంతే. కొంత నరాలు తేలితే 'మగవాడి దేహములా మోటు దేలిపోయింది'-అంటారు.

హృదయముకూడా స్త్రీలది వేరు - పురుషులది వేరు. హృదయమార్దవము స్త్రీకి సహజమంటారు. కవులుకూడా స్త్రీ హృదయాన్ని నవ్యనవనీతసమానమన్నారు. హృదయమార్దవము కలవారి లక్షణాలు ఏమిటంటే గట్టిగా మాట్లాడలేరు — ఎవరయినా మాట్లాడితే వినలేరు. కాఠిన్యము వహించలేరు. ఘోరమైన కార్యాలను చేయలేరు. వినలేరు, చూడలేరు; తలచుకుంటేనే కంపించిపోతారని వాడుక.

'కొసకూ కొసకూ వెన్నవంటి స్త్రీ మనసు కొస్తా కరగిపోతుంది. దీని బాహ్య లక్షణము కన్నీటి ప్రవాహము. బహుశః బలహీనతవల్లనే కావచ్చు - *Tear glans* అధికముగా పనిచేయటము!' అనుకుంటారు. అంటే స్త్రీలు కన్నీరు కార్చటము ఒక సహజలక్షణముక్రింద జమకట్టారన్నమాట. స్త్రీల ఏడ్పును మహాకవులు ఎంత రమణీయంగా వర్ణించారో చూడండి.

ఈసునబుట్టి డెందమున హెచ్చిన
శోకదవానలంబుచే
గాలిసి యేడ్చెఁ బ్రాణవిభు
కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయి
జేల చెలంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ
కలకంఠ వధూకలకాకలీ ధ్వనిన్.
(పారిజాతాపహరణము)

కొసరి వసంతకాలమునఁ
గోయిల క్రోల్చినభంగి నేడ్చె నె
చ్చెసరుహనేత్ర కొండదటఁ
పెద్దయెలుంగున వెక్కి వెక్కి వె
క్కసముగ మన్యువేగమునఁ
గాటుక కన్నులనీరు సోనలై
యుసిరిక కాయలంతలు
పయోధరముల్ దిగువారు నట్లుగన్.
(కాశీఖండము)

ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల
డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ
బటాగ్రం బొత్తి యొత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నర
వధూరాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవ
సుధాపూరంబు తోరంబుగన్.
(వసుచరిత్ర)

......................

పాటలగంధి వేదన
నెపంబిడి యేడ్చెఁ గలస్వ
నంబుతో.............న్రశులు
చిందువందగన్. (మనుచరిత్ర)

ఆ కవులకు స్త్రీలు ఏవిధముగా ఏడిస్తే తమ

# ఆడమాటలు

కంటె కింపుగా ఉంటుందో అవిశదముగా వర్ణించి ఆనందించారు, చదువరుల నానందింపచేశారు (పురుషులను మాత్రమే).

దీనికి వ్యతిరేకంగా ఏ స్త్రీ అయినా ఉంటే 'అబ్బా! మగవాడికంటె కఠినురాలు' అనుకుంటుంది లోకము. ఇక మగవాళ్ళనో! జాలిగుండెకలవారెవరైనా కన్నీరు కార్చగానే 'ఇంత చేతకానివయితే ఎట్లా? ఆడదానిలా ఏడుస్తావేం? వట్టి పిరికి' - అంటారు. ఎవరో కాదుసుమా - ఆడవాళ్లు కూడా అంటారు! మగవాడంటే ఎంత కష్ట సమయములో కూడా కన్నీటిబొట్టయినా రాల్చకుండా - రాతిగుండెతో ఉండాలని ఉంటేనే సహజమని నిర్ణయము చేసి చెప్తారు.

నడకలో కూడా స్త్రీల నడక వేరు - పురుషుల నడక వేరు. మందంగా - అడుగులో అడుగు వేసుకుంటూ స్త్రీలు నడుస్తారు. స్త్రీల నడకను హంస నడక అనీ, గజగమన మనీ, నీటిలో నావ నడచినట్లుగా స్త్రీలు నడుస్తారనీ కవులు హాస్యము పలికారు. దీనికి వ్యతిరేకముగా ఉన్న స్త్రీ నడకను 'అబ్బ! మగవాడి నడక!' అన్నారు. స్త్రీకి మగవాడి నడక ఉంటే అసహజము మగవాడి నడకను మగవాడు అసహ్యించుకోవటము—ఆడవాళ్ల నడకను ఆడవాళ్లు అసహ్యించుకోవటము వింత కాదూ?

ఆపేక్ష అనురాగాలవిషయములోకూడా మగవాళ్ళకూ ఆడవాళ్లకు ఎంతో భేదము ఉన్నది. కొంచెం అందిస్తే చాలు—స్త్రీల ప్రేమలత సాగి, అల్లుకొనిపోతుంది. విడదీయాలంటే చాలా కష్టము. పెనవేసుకొనిపోతుంది. కొంతమంది పురుషులు స్త్రీలను వశము చేసుకోవాలని తంటాలుపడి వాళ్లలో ప్రేమను రగిల్చి కొన్నాళ్లకు విముఖులయిపోతారు. ఒకసారి సాగి పెనవేసుకొన్న ప్రేమలతలను విడదీసుకోలేక - తిరస్కరింపబడినా బ్రతిమిలాడి అల్లుకుని పోదామనే స్వభావము స్త్రీలలో ఉన్నది. ఈ దృష్టాంతాలను సాహిత్యములోనే కాక - సంఘములోకూడా మనము చూస్తునే ఉంటాము.

దుఃఖమూ విచారమూ స్త్రీలకు సహజముగా త్వరగా కలుగుతాయి. కష్టాలను విచారాన్ని స్త్రీలు త్వరగా మరచిపోలేరు. దీనివల్లనే కొంతమంది చేతకాని అధైర్యము అంటారు.

స్త్రీలు ఏమీ తెలియనివారు వట్టి అమాయికలని పేరుపడ్డారు. కొన్ని విషయాలు స్త్రీలకు తెలియకపోవచ్చు. తెలియకపోతే తెలియదనవచ్చుగాని తెలియదు కనుక అమాయికలని అనుకోవటము వింత కాదూ? అమాయకత్వమంటే మనస్సులో తక్కువరకమన్న మాట కాదూ? పురుషులలో అమాయకులంటే పనికిరానివాళ్ళ క్రింద జమ.

ఒక విషయములో ఏమిటి - చూపులో మాటలో - ఎన్నో విషయాలలో స్త్రీలకూ పురుషులకు భేదాలు, వ్యత్యాసాలు కొన్ని సహజంగా ఉన్నాయి. కొన్ని నిరూపించబడ్డాయి.

కొందరపడి ఒక నిర్ణయానికి రావటాన్నికూడా స్త్రీలలక్షణమే నని కొందరంటారు. "స్త్రీలు న్యాయాధికారులయితే ఉరిశిక్ష లుంటాయా?" అని కొంతమందికి ఒకసారి సందేహము కలిగిందట. ఒక వేళ ఉంటే మగవాళ్ళు దయ మనుకోవలసిందే కదూ? సైన్యములో స్త్రీలు చేరాలనికొం...

రంటారు. స్త్రీలకు దేహసౌకుమార్యము చెడిపోతుందనీ అందాల నడకలు కొంచెం పాడవుతాయనీ నోటు తేల్చారని కొందరు ఆడగని సలహాలను వెదజల్లుతున్నారు.

"స్త్రీలు వ్యవసాయశాఖలో ఉద్యోగము చేయటము కష్టమే. పొలాల్లో - బురదలో వానలో - తిరగటము వాళ్ళకేమి చేతనవుతుంది? పిల్కు చీరెలు కట్టుకొని - పంఖాల క్రింద కుర్చీలమీద కూర్చుని ఉద్యోగాలు చేయాలని ఉబలాటపడతారుగాని కష్టపుపనులు చేయగలరా?" అని కొందరి ఊహా పరంపర.

స్త్రీ వైద్యురాండ్రు విద్యాభ్యాసము చేసేటప్పుడు ఎంతమంది ధైర్యముతో శవాలను చూడగలుగుతారు?" అని ఒక సాంఘిక తత్వవేత్తకు పెద్దసందేహము కలిగింది ఒకసారి.

ఇంతకూ ఆడమాటలకూ మగమాటలకూ భేదా ఉంటే ఉండవచ్చు-గాని ఎక్కువ తక్కువలను ఎంచుకోవటము ఈనాడు ...

# సన్నిహిత పరిచయాలు

★

కొమ్మూరి ఉషారాణి

"కమలా! ఇవాళ నా స్నేహితు లొస్తున్నారు. నిన్ను పరిచయం చేస్తాను. కొత్త వాళ్లతో మాట్లాడటానికి ప్రయత్నించు. మరీ ముంగిలా కూర్చుంటే బాగుండదు. ఏమైనా అనుకుంటారు. చిన్నప్పుడు నీ స్నేహితురాండ్రు వస్తే ఎలా మాట్లాడేదానవో అలానే హాయిగా మాట్లాడెయ్యి. వాళ్ళు బాగా చదువుకున్నవాళ్లు. దూరం నుంచి వస్తున్నారు."

"నా కేమిటోలా వుంటుందండీ."

"ఆ సంకోచమెందుకూ? వాళ్ళేమీ ఆకాశంనుంచి దిగివచ్చిన దేవతలు కారు. కానీ కొత్తగా మీకు పిల్లలెందరు, అక్కచెల్లెళ్ళకి ఎప్పుడెప్పుడు వివాహాలయాయి అనే ప్రశ్నలు వేసేసి వూరుకోక, మేము ఏ విషయాన్ని గురించి మాట్లాడుతున్నా కలసి ఓ నాలుగు ముక్కలు అనటానికి ప్రయత్నించు."

"అలాగేనండీ."

సాయంత్రం అయిదుగంట లవుతుంది. టేబిలుమీద కొన్ని పుస్తకాలూ పత్రికలూ అమర్చబడివుంటాయి. అతిథులు వచ్చే సమయం దగ్గరవుతున్న కొద్దీ కమలకి కొద్దిగా దడ, ఖంగారు ప్రారంభమవుతాయి. ఏమి మాట్లాడాలీ, ఎలా మాట్లాడాలీ అనే బెంగ ఎంత వద్దనుకున్నా ఆమెను వేధిస్తాయి. తీరా ఏదైనా అసంతృప్తికరంగా మాట్లాడి భర్తను సంతుష్టపరచలేనేమో అనే దిగులే అన్నిటికంటె ఎక్కువగా ఆమెను బాధిస్తుంది. ఆ దిగులు ఆమె మనస్సుని వేధించటమే గాక ఆమె తీరునే మార్చివేస్తుంది. మరి దేనిమీదనూ మనసు కేంద్రీకరించలేక ఆలోచిస్తూ కూర్చుంటుంది. ఆహ్వానించిన వ్యక్తులు వస్తారు. అరగంటవుతుంది; గంటవుతుంది. అతిథులు కులాసాగా ఖబుర్లు చెప్పుకుంటూవుంటారు. కాని కమలమాత్రం వారి సంభాషణ వినకుండా,



ఆతరువాత తను ఏ విషయాన్ని గురించి మాట్లాడితే బాగుంటుందా అని ఆలోచిస్తూ కూర్చుంటుంది. ఈలోపుగా వారు రాజకీయాలు సాహిత్యం మొదలైనవాటిని గురించి చురుగ్గా సంభాషణ సాగిస్తారు. కమల కాన్సేపు సీలింగుఫానువంకా, కాస్సేపు తివాసీవంకా చూస్తూ కూర్చుండిపోతుంది. కాని టెలిఫోన్ పిలుపు వచ్చి భర్త వెళ్ళిపోవటంతో ఆమెకు పరీక్ష తప్పదు.

"ఇవాళ ఆకాశంలో మబ్బుల్లేవు" అనేసి చటుక్కున నాలిక్కరుచుకుంటుంది. అసలు మనసులో వున్నదేమిటో కాని మరేదో అనేస్తుంది. అతిధులు కమల యిబ్బంది చూచాయగా బోధపడినట్లు ఆమె వంక జాలిగా చూస్తారు.

"అవునండీ! ఇవాళ వర్షం కురవదనుకుంటాను. మీకు సాహిత్యమంటే యిష్టమేనా? కవిత్వంలో అభిరుచి వుందా?" అని ఒకరు ప్రశ్నిస్తారు.

"పద్యాలు చదవడమంటే నాకు చాలా యిష్టం. చిన్నప్పుడు ఒంటరిగా కిటికీలో కూర్చుని కూనిరాగాలు తీస్తుంటే అమ్మా నాన్నా నేను గాయకురాల నవుతా ననుకు

న్నారు. మొదట్నుంచీ నాకు సంగీతమంటే అంత యిష్టముండేది కాదు. స్కూల్లో కొద్దిగా ఛందస్సు నేర్చుకున్న తరువాత పద్యాలు వ్రాయటానికి ప్రయత్నించాను. ఒకరోజు నేనూ లలితా మామిడి చెట్టుకింద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాము. ఏదో వ్రాయాలనే నా ఉత్సాహం. తీరా కాయితం కలం తీసుకోగానే ఉత్సాహం చల్లారిపోయింది. ఇదే ఆమెకి చెప్పాను..."

చిన్నప్పటి తన ఆవేశాలు, ఉద్రేకాలను గురించి వర్ణిస్తుంది. క్రమంగా ఆమె సంభాషణ వ్యక్తిగతంగా మారిపోతుంది ఆమెను తిరిగి ఈ ప్రపంచానికి లాక్కురావటానికి చాలా అవస్థపడతాడు భర్త. స్నేహితులు వెళ్ళిపోయిన తరువాత, ఆడవాళ్ళంతా అంతేననీ, లౌకిక సంభాషణలో పాల్గొనటం తెలియదనీ దూషిస్తాడు. తన అపజయానికీ భర్త అసంతృప్తికీ కారణం స్ఫురించక, మళ్ళీ అటువంటి సంఘటన రాకుండా కాపాడమని వెయ్యిదేవుళ్ళని ప్రార్థిస్తుంది ఆ అమాయకురాలు. రాత్రి ఆమెకు ఒక మూగశిశువు జన్మించినట్లు కలవస్తుంది.

చిన్నప్పటినుంచీ కమల మితభాషిణి అని అందరూ మెచ్చుకునేవారు. అలా అని పైకి ఎవరన్నా పొగిడినప్పుడు ఆమె మురిసిపోయేది. తల్లిదండ్రులుయిచ్చిన శిక్షణ పరిసరవాతావరణం ఆ అలవాటుకి కారణాలు. పరులతో సంభాషించడమువల్ల వచ్చే కష్టనిష్ఠురాలకు అర్థం తెలియని పసితనంలో హృదయాన్ని ఆక్రమించుకున్న కొన్ని భావాలు కాలక్రమేణా ఆమెను విచిత్రమైన అనుభవాలకి గురిచేస్తాయి పాలమనిషితోనూ, పనిమనిషితోనూ కొంత కటువుగా మాట్లాడవలసి వచ్చినప్పుడు, చిన్నప్పుడు అమ్మ ప్రతివారితో సౌమ్యంగా మాట్లాడమని ఎందుకు బోధించిందా అనే సంశయం మటుకు కలిగేది. వివాహానంతరం పదిమందితో కలిసి మాట్లాడవలసి వచ్చినప్పుడు ఎక్కువ రంజింపలేక భర్త విసుక్కున్నప్పుడూ ఆమెను అనేక అనుమానాలు పీడించేవి. పురుషులు వారి భావాలను ప్రకటించేందుకు సంభాషణను అంత చులాగ్గా హాయిగా ఉపయోగించుకుంటారు, తన కాశక్తి ఎందుకు లేదా అని తరుచు దుఃఖించేది భర్తయింటికి రాగానే ఏ పత్రికో ముఖాని కడ్డుపెట్టుకుని కూర్చునేవాడు. కమల అనేక విషయాలలో ఆసక్తి చూపేది కాదు. ఎవరితోనూ చర్చించేది కాదు. కానీ అందరికీ దూరంగా వున్నప్పుడు, తనను ఎక్కువ బాధిస్తున్నది ఒంటరితనం కాదనీ, ఏదో సాహచర్యలోపమనీ అప్పుడప్పుడూ అనిపించేది.

* * *

సంభాషణ ఒకవిధంగా మొదలెడితే బాగుంటుందీ, దానిలో కొన్ని విషయాలే రాణిస్తాయి అనీ కొలతబద్దలు పెట్టుకూర్చునేవారికి, ప్రతివారినీ తట్టి పలుకరిస్తూ సంభాషణనంతా తమ భుజస్కంధాల మీదనే వేసుకుని అనర్గళంగా మాట్లాడే వారినిచూస్తే తరుచు ఆశ్చర్యం కలుగుతుంది. అటువంటివారిని హేళనచేయటం, విమర్శించటం సులభం కావచ్చు. కానీ సంభాషణకూడా ఒక కళ; అది ఒక అలవాటు. స్త్రీలు ఎక్కువ మాటకారులనే వాదన వున్నప్పటికీ, సామాన్య విషయాలకంటె వ్యక్తిగత విషయాలను గురించి మాట్లాడటానికే వారు ఎక్కువ యిష్టపడతారు. గడచిపోయిన విషయాలను గురించి సంభాషించడంలో ఎక్కువ ఆసక్తి చూపుతారు. ఇద్దరు ఆడవాళ్లు కలుసుకోగానే, ఫలానా సంవత్సరంలో ఫలానా స్థలంలో వారు ఎలా కలుసుకున్నదీ ఇటువంటి విషయాలనుగురించి చక్కగా గంటల తరబడి మాట్లాడేసుకుంటారు. హాస్యధోరణిలో నడిచే సంభాషణ సామాన్యంగా స్త్రీలకు రుచించదు. "స్త్రీలను పలుకరిస్తే చాలవరకు వారి అభినయంద్వారా ఏమైనా తెలుసుకోవచ్చునేమో గానీ, సూటిగా సమాధానాలు చెప్పటం, సంభాషణా చాతుర్యం వారిలో కనిపించ"వని కొందరు పురుషులు నేరారోపణ చేస్తుంటారు. వ్యావహారిక, తార్కిక జ్ఞానములకు సంబంధించిన సంభాషణలో సామాన్యంగా స్త్రీలు ఆసక్తి చూపరు. ఆ విషయాలు వారికి విసుగు పుట్టిస్తాయి.

మనసులో వున్నది యితరులతో చెప్పటములోనూ, ఒకరి భావాలొకరి కెరుకపరచుకోవటములోనూ తప్పులేదు. 'మేధాశక్తిని సంభాషణద్వారానే వృద్ధిచేసుకోగలం' అన్నాడు ఒక రచయిత. "సంభాషణద్వారా అజ్ఞానాన్ని బయటపెట్టుకోవటంకంటె వూరుకోవటమే మేలు" అన్నాడు మరో రచయిత. సంభాషణ గురించి విరుద్ధాభిప్రాయాలను వెల్లడించిన వీ రిద్దరూ ప్రఖ్యాతవైజ్ఞానిక వేత్తలు. వీరిలో ఎవరితో పూర్తిగా ఏకీభవించటమున్న నేమాటటుంచి, మేధాశక్తీ, లౌకికజ్ఞానమూ అందజేసే సోపానాలలో సంభాషణ ఒకటే అనుకోవచ్చు. కానీ సామాన్యంగా సమాజనీతిని కాపాడే బాధ్యతా, నియమాలప్రకారం సద్గుణాలని అలవరచుకోవలసిన భారమూ ఒక్క స్త్రీలదే అని భావించేవారు, స్త్రీలు సంభాషణలో ఆసక్తిచూపిస్తే అదేదో అస్వాభావికమనీ అసహజమనీకూడా భావిస్తారు చిన్నపిల్లలు క్లాసురూములో కూర్చునేటప్పుడు మాట్లాడకూడదనీ, మేష్టారు పేముబెత్తం తిరగవేస్తారనీ, అది సభ్యత కాదు అనీ ఇటువంటి భయాలు అలవాటు చేస్తారు. అలాగే ఆడపిల్లలు ఎక్కువ మాట్లాడకూడదనీ, ముఖ్యంగా పరులతో సంభాషిస్తే అనర్థాలు కలగడమే కాదు, ఎబ్బెట్టుగాకూడా వుంటుందనే అపోహ ఒకటుంది.

పూర్వం చైనాలో స్త్రీలు అతిగా మాట్లాడితే వారికి భర్తలు విడాకులిచ్చేవారట. స్త్రీలను ఏవిధంగా యితర అవకాశాలకు దూరంచేసి, వారి వ్యక్తిత్వాన్ని అణగద్రొక్కారో, అదేవిధంగా ఈ శక్తినీ అణచివేసివుంటారు. మితభాషులైన వ్యక్తుల పట్ల సమాజం చూపే ఆదరణను పురస్కరించుకుని, పదిమంది సమావేశమైనప్పుడు స్త్రీలు సామాన్యంగా సంభాషణలో పాల్గొనటానికి జంకుతారు అటువంటివారిని చూసి స్త్రీ పురుషులను వేరుచేసి ఆలోచించగలిగే హృదయవైశాల్యం, సాహసం, మగువదనం లోపిస్తున్నాయని కొందరు అసంతృప్తి ప్రకటిస్తూంటారు. ఈ రకం సంకుచిత అభిప్రాయాలతో మనసు పాడుచేసుకోకుండా, పురుషులతో స్వేచ్ఛగా మాటాడే యువతిని లోకం అపార్థం చేసుకోదనే నమ్మకమూ లేకపోవచ్చు.

ఒక వ్యక్తికి సక్రమమైన విద్య శిక్షణ లభించాలంటే, సమగ్రమైన మనోవికాసం చేకూరాలంటే సమాజానికీ ఆ వ్యక్తికీ మధ్య గోడలని నిర్మించలేము. పరిసర వాతావరణం, కొన్ని సంఘటనలు, పరిచయాలు ఆ వ్యక్తిలో చైతన్యం కలిగిస్తాయి. జీవితం పట్ల ఆ వ్యక్తి దృక్పథాన్ని మారుస్తూ, ఉద్రేకాలనీ భావాలనీ సక్రమమైన ఒక దారివెంట నడిపిస్తాయి క్రమంగా వ్యక్తిత్వంలో వికాసం కలుగుతుంది. జీవితానుభవాలలో అతి ముఖ్యమైనవి రకరకాల వ్యక్తులతో కలిగే పరిచయం, వారితో కలిసి మసలడంలో లభించే శిక్షణ అని చెప్పవచ్చు. అర్థరహితమైన ఊహలతో సమాజం అందించగల ఆ సంస్కారానికి దూరం కావడం అవివేకం. పదిమందితో కలసి మాట్లాడలేకపోవటం, సామాన్య విషయాలపట్ల ఆసక్తి చూపలేకపోవటం అంటే జీవితావసరాలను పోగొట్టుకోవటం కాకపోవచ్చు; కానీ ఒకరకమైన సంస్కారానికీ, అభివృద్ధికీ మటుకు దూరమయే అవకాశం వుంది.






# కన్నతల్లి

చావలి రామచంద్రరావు

సాటిలేని ప్రేమతో నిను
వక్షానికి హత్తుకొనుచు
బొజ్జనిండ పాలు గుడిపి
సాకినవా రెవ్వరోయి?
కన్నతల్లి! కన్నతల్లి!

చేతుల ఉయ్యాలలోన
చేర్చి నిన్ను లాలించుచు
మోదముతో బుగ్గలపై
ముద్దు లెవరు వర్షించిరి?
కన్నతల్లి! కన్నతల్లి!

నిద్దుర నీకన్నులపై
వాలుట గనినంతలోనె
జోలపాడి చిచ్చిగొట్టి
బజ్జో బెట్టినదెవ్వరు?
కన్నతల్లి! కన్నతల్లి!

వచ్చిరాని మాటలతో
వగలమారి వేషాలతో
వింతవింత ప్రశ్నలతో
ఎంతగవిసిగించిన సరె

రుసరుసలాడంగబోక
ముసిముసి నవ్వులను నగుచు
ముద్దుగ నిను తృప్తిపరచి
ముద్దాడెడు వారలెవరు?
కన్నతల్లి! కన్నతల్లి!

తుంటరిపిల్లలతో గూడి
కొంటెపనులు జేయుచుండ
ఒంటరిగా బిలచి నిన్ను
మందలించి, నీతిజెప్పి
కొంటెతనము మానిపించు
యింటిపంతు లెవ్వరోయి?
కన్నతల్లి! కన్నతల్లి!

పొత్తమొకటి బట్టినీవు
ఒత్తిఒత్తి చదువుచుండ
చాటునుండి చూచిచూచి
సంతోషము పొంగిపొరల
ఊహా లోకములందున
విహరించెడి వారలెవరు?
కన్నతల్లి! కన్నతల్లి!

పెద్దచదువులెన్నొ నేర్చి
దొడ్డవాడు కాగలడని
పెద్దతనములోన తనను
ఉద్ధరించగలడటంచు
తన సర్వము నీమేలుకు
వెనుకాడక పణముబెట్టి
ఆశలన్ని నీమీదనె
నిలుపుకొనెడి వారెవ్వరు?
కన్నతల్లి! కన్నతల్లి!

విన్నామొక భగవంతుడు
ఉన్నాడను కొనుచుండుట
ఉన్నాడో లేడోగాని
కన్నవారు కనుపించరు.
కన్ను రెప్పకన్న నిన్ను
మిన్నగాను కాపాడుచు
కన్నులెదుట కానుపించు
ఎన్నదగిన దైవమెవరు?
కన్నతల్లి! కన్నతల్లి!



# పాపమూ, ప్రాయశ్చిత్తమూ

మధురాంతకం రాజారాం

ఒకానొక రాజ్యం. దానిపేరు విదర్భ. ఆరాజ్యానికొక ముఖ్య పట్టణం. దానిపేరు శ్రావంతి. ఆ పట్టణంలో ఒక రాజు. అతడిపేరు ప్రసేనుడు.

ఒకరోజు సాయంత్రం సందె చీకట్లు లోకాన్ని ఆవరించుకుంటు న్నప్పుడు ఒకయువకుడు శ్రావంతీ నగరంలో ప్రవేశించాడు. అతడు



"ఏది?"

రూపవంతుడు. ఆజానుబాహుడు. ప్రయాణపుబడలిక చేత ముఖం ఇంచుక వాడివున్నా అతడికన్నుల్లో నుంచి మాత్రం కాంతులు పొంగు తున్నాయి.

అతడికి ఆపట్టణంలో గమ్యస్థాన మంటూ ఏదీ లేదు. రాత్రికి ఎక్కడైనా పడుకోవాలి. తెల్లవారిన తరువాత ఏ మంత్రినో, ఏ దండ నాయకుణ్ణో ఆశ్రయించి ఒక చిన్న ఉద్యోగం సంపాదించుకోవాలి. ఇదీ అతడినిర్ణయం.

రాజవీథిలో పడిపోతున్న అతడు ఒకచోట ఆగాడు. అతడు ఆగిన చోటికి కూతవేటుదూరంలో ఒక దేవాలయం వున్నది. గంభీరంగా నిలచివున్న ఆ దేవాలయగోపురం లోని ఏడు అంతస్తుల్లోనుంచీ ఏడు జ్యోతులు నిశ్చలంగా వెలుగుతూ ఆప్రదేశాన్ని దేదీప్యమానం చేస్తున్నాయి. కోవెల లోపలినుంచీ దేవుడికో, దేవికో పూజ జరుగు తున్నందుకు చిహ్నంగా గంట గణ గణ మ్రోగుతోంది.

తను అక్కడికి వచ్చి నిలబడిన సమయానికి సరిగ్గా దేవాలయ ఘంటిక మ్రోగడం అతడికొక శుభ శకునంగా తోచింది. అప్రయ త్నంగా అతడిపాదాలు దేవాలయం వైపు నడిచాయి.

అది శ్యామలాదేవి ఆలయం. ఆదేవి శ్రావంతి నగరపురాజులకు ఇలువేల్పని అనేకమంది చెప్పు

కుంటూవుండగా మనబాటసారి విన్నాడు. అతడికీమాట విన్నప్పుడు నవ్వు వచ్చేది! 'జగజ్జనని శ్యామలాదేవి ఆ ఒక్క రాజవంశానికి మాత్రమేనా ఇలువేల్పు! ప్రపంచానికంతా ఆమె ఇలువేల్పే' నని అతడి ఉద్దేశం.

దేవిని దర్శించి అతడు గర్భగుడి నుంచి ఈవలికి వచ్చాడు. దేవాలయపు గోడలపైన త్రిపురాసుర సంహారం, మహిషాసురమర్దనం మొదలైన శిల్పాలు అతడికి నయనపర్వంగా కనిపించాయి వాటిని తిలకిస్తూ అతడు గర్భగుడి వెనుకవైపు వెళ్లాడు. అక్కడదీపాలు లేనందు వల్ల చీకటిగావుంది. అందుచేత అతడు వెనుదిరిగి రెండడుగులు ముందుకు వేశాడు. ఇంతలో వెనుకవైపున వున్న రావిచెట్ల మధ్యనుంచి ఏదో నవ్వడి వినిపించింది. అతడు మళ్లీ వెనుతిరిగి చూచాడు. అక్కడ ప్రహారీగోడ బాగా శిథిలమైపోయినందువల్ల ఒక రాతిగుట్ట ఏర్పడివుంది. ఆగుట్టపైన ఎవరో ఇద్దరు ముగ్గురు వ్యక్తులు ఏదో చేయరానిపని చేస్తున్నట్టు మన యువకుడికి స్ఫురించింది. అతడు చెట్లమరుగునే తక్కుతూ, తారుతూ ఆ గుట్టదగ్గరికి వెళ్లాడు. నఖశిఖ పర్యంతం నల్లని వుడుపుల్ని ధరించిన భయంకరాకారులు ముగ్గురు ఒక అబలని బంధించి తీసుకపోతున్నారు. దేవాలయంలోనే ఇంతటి దౌర్జన్యానికి ఒడిగట్టిన ఆ ద్రోహుల్ని చూడగానే యువకుడు ఆవేశంతో తనను తానే మరచిపోయి ఒరనుండి ఖడ్గాన్ని ఊడదీసుకుని సింహాకిశోరంలా వాళ్ళపైనపడ్డాడు.

ఆకస్మికంగా సంఘటిల్లిన ఎదిరి తాకిడికి తట్టుకోలేక ఆ ముగ్గురు దుర్మార్గుల్లో ఇద్దరు పలాయన మంత్రం పఠించారు. ఒకడుమాత్రం ధైర్యాన్ని కూడదీసుకుని పోరుకు తలపడ్డాడు. కానీ అసాధారణమైన మన యువకుడి ఖడ్గచాలనంముందు వాడి శౌర్యం ఎందుకూ కొఱగాలేదు. అందుచేత వాడు కూడా అక్కడినుంచీ పారిపోయాడు.

తరువాత యువకుడు భయంచేత కంపించిపోతున్న బంధితురాలి దగ్గరికివెళ్ళి త్రాళ్ళను తెగగోసి ఆమెకు బంధవిముక్తి కలిగించాడు. ఆమె లేచి నిలబడి కృతజ్ఞతాభరంతో తలవంచుకుని చేతుల్ని జోడించి "అయ్యా! తమ రెవరో నాకు తెలియదు. ఈ అపాయంనుంచి తప్పించినందుకు మీ కాజన్మాంతం ఋణ



"ఇదుగో"! —డి. రామలింగేశ్వరరావు, మద్రాసు.

## ★ పాపమూ, ప్రాయశ్చిత్తమూ ★

పడివుంటాను" అన్నది.

"అమ్మాయీ! నువ్వెవరివి? ఈ క్రూరులెందుకు నిన్ను బంధించారు?" అన్నాడు యువకుడు.

"ఈ విదర్భరాజ్యానికి కోశాధికారిగా వుంటున్న ఉదయ వర్మగారు మా నాన్నగారు. ప్రతిశుక్రవారమూ దేవిని దర్శించడంకోసం కాలినడకతోనే రావడం నా వాడుక. నేను దేవాలయాన్ని ప్రదక్షిణం చేస్తుండగా ఈ దురాత్ములు నన్ను బంధించారు. బహుశా వాళ్ళు నా నగల్ని దోచుకోవడానికి ఈ పని చేసివుంటారు" అన్నది ఆ యువతి.

"నీకు మరేమీ అభ్యంతరం లేకపోతే నేను మీ ఇంటివరకూ నీకు తోడుగా రాగలను" అన్నాడు యువకుడు.

"మీకు శ్రమకలిగించడం నా కిష్టంలేదు. మీ పేరేమిటో, ఎక్కడుంటారో తెలియజేస్తే చాలు. మీ ఉపకారానికి ప్రత్యుపకారం చేసే అవకాశం ఏదైనావుంటే మా నాన్నగారు చాలా సంతోషిస్తారు" అన్నది ఆ యువతి.

యువకుడు ఆమెను రాజవీధి వరకూ తీసుకపోయి, "నా పేరు ధర్మపాలుడు. ఉద్యోగంకోసం ఈ పట్టణానికి వచ్చాను" అని చెప్పి, ఆమెదగ్గర సెలవుతీసుకున్నాడు.

**2**

కొందరు మానవులు పుట్టింది మొదలు చనిపోయేవరకూ కఠిన హృదయులుగానే వుండిపోతారు. ఎంతటి హృదయవిదారకమైన సంఘటన కనపడినప్పటికీ వాళ్ల మనసు కరుగదు. అలాంటి వారిలో శ్రావంతి నగరపు కారాగృహాధికారి కాలవర్మ అగ్రగణ్యుడు.

ఉద్యోగరీత్యా ఎల్లప్పుడూ చోరులమధ్యా, క్రూరులమధ్యా, హంతకులమధ్యా కాలం గడిపినందుచేతనేమో, అతడి హృదయం పాషాణంకన్నా కర్కశమైపోయింది.

తన నలభై ఏళ్ళ జీవితంలో కాలవర్మ మూడుసార్లు పెళ్లి చేసుకున్నాడు. ఆముగ్గురు భార్యల్లో ఇద్దరు చనిపోయారు. ఒకభార్య మట్టుకు బ్రతికేవుంది! ఐనా కాలవర్మకు మాత్రం పెళ్లిపిచ్చి కుదరలేదు. తన తలవెంట్రుకలు పూర్తిగా తెల్లబడే లోపల మళ్ళీ ఒకసారి పెళ్లిపీటలపైన కూచోవాలనే ఆ కాంక్ష ఎడారిలో గాలిదుమారంలా అతడి మనసులో చెలరేగుతూ వుండేది.

ఒకరోజున కాలవర్మ అశ్వారూఢుడై రాజవీధిలోపడి ఎక్కడికో పోతూవుండి దేవాలయ ప్రాంగణంవద్ద ఒక అమ్మాయిని చూచాడు. చూచిన తక్షణమే కళ్లాన్ని లాగబెరికి, గుఱ్ఱాన్ని నిలిపి వెనువెంబడి వస్తున్న భటుణ్ణి "ఆ చక్కని చుక్కను కుమార్తెగా బడసిన అదృష్టం ఏతల్లిదండ్రులది?" అని ప్రశ్నించాడు.

"ఆమె కోశాధికారి ఉదయవర్మగారి కుమార్తె" అని సవినయంగా విన్నవించాడు భటుడు.

కాలవర్మ గుఱ్ఱాన్ని గిఱ్ఱున వెనక్కి త్రిప్పి ఇంటికి పరిగెత్తించాడు. ఇల్లు చేరుకోవడమే తడవుగా తన కులపురోహితుడికి కబురు పంపించాడు. అతడు సముఖానికి రాగానే ఉదయవర్మ దగ్గరికి వెళ్లి పెళ్లి సంబంధాన్ని కుదుర్చుకుని రమ్మని ఆనతిచ్చాడు.

ఉదయవర్మను దర్శించి అతడి సపర్యల్ని, సత్కారాల్ని అందుకున్న తర్వాత పురోహితుడు తను వచ్చిన విషయాన్ని గురించి ప్రస్తావించి, ఆతరువాత "ప్రపంచాన్ని కనుసన్నలతో శాసించడానికి మానవుడికి ముఖ్యంగా కావలసినవి ధనమూ, అధికారమూ. ఇవి రెండూ కాలవర్మదగ్గర పుష్కలంగా వున్నాయి. అతడికి కుమార్తె నివ్వడానికి ఏతల్లిదండ్రులయినా సంతోషంతో అంగీకరించవచ్చు" అంటూ తన అభిప్రాయాన్ని కూడా జోడించాడు.

ఉదయవర్మ మెల్లగా నవ్వాడు. నవ్వి "లక్ష్మి చంచలమైంది. అధికారంగూడా అంతే. మానవుడు సచ్ఛీలుడైతే అవి లేకపోయినా సరే, ప్రపంచాన్ని శాసించగలడు. మరి ఆశీలానికి సంబంధించినంతవరకూ కాలవర్మపైన ఎన్నో అపోహలున్నాయి. ఆ అపోహల్లో ఎంతో కొంత సత్యమైనా వుండి తీరుతుందని నావుద్దేశం. అందుచేత కాలవర్మకూ, మాకూ వియ్యమనేది పొసగనివిషయం" అన్నాడు.

పురోహితుడు తిరిగివచ్చి కాలవర్మదగ్గర ఉదయవర్మ చెప్పిన మాటల్ని తూచా తప్పకుండా వల్లించాడు.

కాలవర్మ కాలభైరవుడిలా ఉగ్రుడై పైకిలేచి "కోశాధికారి

ఉదయవర్మకు కళ్ళు నెత్తిపైకెక్కినట్టున్నాయి! అయ్యా, బ్రాహ్మణుడా! శపథంచేసి చెబుతున్నాను. ఇక మూడుమాసాల లోపల నేను ఉదయవర్మ కుమార్తెను పెళ్ళాడితినా, సరేసరి! లేకుంటే గాడిదపై కూచోని ఈ శ్రావంతినగరంలో ఊరేగుతాను" అని కత్తిని తాకి ప్రతిజ్ఞ చేశాడు.

కాలవర్మ యొక్క అనుపాజ్ఞల్లో కాలకింకరుల్లాంటి భటులు కొందరున్నారు. ఉదయవర్మ కుమార్తెను బందీగా తీసుకరావలసినకార్యం వాళ్ళకు అప్పగించబడింది. వాళ్ళు అవకాశంకోసం వేచి, వేచి, ఆమెకోసం పొంచి పొంచి కడకొకనాడు దేవాలయం వెనుకవైపున ఆమెను బంధించారు. కానీ ధర్మపాలుడి ఆగమనంవల్ల వాళ్ళకుట్ర కాస్తా విఫలమై పోయింది.

ఉదయవర్మ ధర్మపాలుణ్ణి పిలిపించి, అతడి శౌర్యసాహసాల్ని శ్లాఘించి, మహారాజుతో స్వయంగా చెప్పి సైన్యంలో ఒక కొలువు ఇప్పించాడు. పువ్వు పుట్టగానే పరిమళించినట్టు, ధర్మపాలుడు సైనికుడు కాగానే విలువిద్యాప్రదర్శనాల్లోనూ, ఖడ్గయుద్ధాల్లోనూ తన చాతుర్యాన్ని ప్రదర్శించి మహారాజు మన్ననలు అందుకున్నాడు. అందుచేత అతడు అచిరకాలంలోనే ఒక అశ్వికదళానికి నాయకుడై, 'దళపతి' అన్న బిరుదంతో సన్మానింపబడ్డాడు.

ఉదయవర్మ ఎదుటివారి మనసులోగల ఉద్దేశాన్ని ఇట్టే గ్రహించివేయగల అనుభవశాలి. అతడు

తన కుమార్తె అభీష్టాన్ని గుర్తెరిగి చేయడానికి అంగీకరించాడు. తనం
ఆమెను ధర్మపాలుడికిచ్చి పెళ్ళి తట తానుగా వలచివస్తున్న సిరిని

# ★ పాపమూ, ప్రాయశ్చిత్తమూ ★

ధర్మపాలుడు కూడా నిరాకరించ లేదు. పెద్దలచేత వివాహ ముహూర్తం నిశ్చయింపబడింది.

## 3

శ్రావంతీ నగరం విజయదశమి వేడుకలకు పేరుగాంచిన పట్టణం. మహారాజుగారి పర్యవేక్షణ క్రింద జరిగే ముష్టియుద్ధాలు, ఖడ్గయుద్ధాలు ఆ వేడుకల్లో ముఖ్యమైనవి. వాటిని చూచేందుకు లక్షలాది ప్రజలు శ్రావంతికి వస్తుంటారు. విజయదశమినాటికి మహారాజు నిండుపేరోలగంలో నెలకొని వుండి గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్టడంతో వేడుకలు ఆఖరైపోతుంటాయి.

మామూలుమేరకు ఆ సంవత్సరంకూడా విజయదశమి ఉత్సవాలు చాలా వైభవంగా జరిగినాయ్. కానీ మహారాజుగారు బహుమతుల్ని పంచిపెట్టబోతున్నారనగా, విదర్భదేశస్థులందరికీ విభ్రమను కలిగించే సంఘటన ఒకటి జరిగిపోయింది.

విశాలంగా అమర్చబడిన చలువపందిళ్ళ క్రింద అసంఖ్యాకులైన ప్రేక్షకులు ఆసీనులయ్యారు. వారికెదురుగా ఉన్నత వేదికపైన మంత్రి పురోహిత దండనాయకులాదిగాగల పరివారంతో సహా మహారాజు సింహపీఠికపై కూర్చున్నాడు. మహామంత్రి లేచి నిలబడి రాజుగారి చేతికి ఒక్కొక్కటిగా బహుమతుల్ని అందివ్వబోతున్నాడు. సరిగ్గా ఆ సమయానికి ప్రేక్షక సమూహంలో ఏ మూలనుంచో 'పాము, పాము' అన్న గావుకేక వెలువడింది.

ప్రేక్షకులందరూ లేచి నిలుచున్నారు. కొందరు అటూ, ఇటూ పరుగెత్తబోయారు. సభంతా గందరగోళమైపోయింది. అప్పుడు జనసమూహంలోనుంచి ఒక ఈటె చరాలున పైకి లేచి, వాయువేగంతో ముందుకుపోయి మహారాజుగారి చెంపను దూసుకుని వెళ్ళి సింహాసనానికి గ్రుచ్చుకున్నది.

మహారాజు ప్రసేనుడు తటాలున లేచినిలబడి "ఎవడా ద్రోహి?" అని గర్జించాడు.

"ఆ ద్రోహి ఇక్కడేవున్నాడు ప్రభూ!" అన్నది ఒక కర్కశమైన కంఠస్వరం. అందరిచూపులూ ఆ మాటలు వినవచ్చిన వైపు ప్రసరించినాయ్. అక్కడ కాలవర్మ నిలబడివున్నాడు!

"మహారాజుపైకి మారణాయుధాన్ని విసరిన సాహసం ఎవడిది కాలవర్మా" అని ప్రశ్నించాడు మహామంత్రి.

కాలవర్మ తనచెంతనే నిలబడివున్న ధర్మపాలుణ్ణి మహారాజు ముందుకు త్రోసి "ఈ దుష్కార్యాన్ని చేసింది వీడే ప్రభూ !" అన్నాడు.

ఈసారి అందరిదృష్టీ ధర్మపాలుడిపైకి ప్రసరించింది. కానీ అతడి ముఖంలో అమాయకత్వంతో కూడుకున్న విస్మయంతప్ప మరే భావమూ ద్యోతకం కాలేదు.

"ఈ పనిచేసింది నువ్వేనా?" అని ప్రశ్నించాడు మహారాజు.

"కాదు ప్రభూ! నేను నిర్దోషిని" అన్నాడు ధర్మపాలుడు.

"వీడి మాటలు నమ్మకండి ప్రభూ! వీడు మేకవన్నె పులి. పయోముఖ విషకుంభం. తేనెపూసినకత్తి" అన్నాడు కాలవర్మ.

"నువ్వీపనిచేయలేదని నీ పక్షాన సాక్ష్యం చెప్పడానికి ఇక్కడెవరైనా వున్నారా?" అని ప్రశ్నించాడు మహామంత్రి.

ధర్మపాలుడు తలపైకెత్తి ఒకసారి సభనంతా కలయజూచి "భగ

వంతం దొక్కడుతప్ప మరెవరూ సాక్ష్యం చెప్పలేరుప్రభూ!" అన్నాడు.

"ఆ భగవంతుడు నీకోసం ఇక్కడికివచ్చి సాక్ష్యం చెబుతాడని నే ననుకోను! ప్రభూ! ఇతడు తన ఈటెను తమపైకి విసరడం ప్రత్యక్షంగా చూచాను. నిజంగా ఇతడు దోషి. తరువాత మీయిష్టం." అన్నాడు కాలవర్మ.

మహారాజు కొంతసేపు ఆలోచించి "మనదేశంలో రాజద్రోహులకు ఉరిశిక్షకన్నా గత్యంతరం లేదు. ఐనా ఈరోజు విజయదశమి. ఈ పండుగరోజున ఇతని కంత పెద్ద శిక్ష విధించడానికి నాకు మనస్కరించడంలేదు. కాలవర్మా! ఈ రోజురాత్రి ఇతడిని చెఱసాలలో వుంచి, రేపు ఉదయం ఇతడి కుడి చేతిని తెగనరికించు. అదే వీడికి తగినశిక్ష" అన్నాడు.

## 4

ధర్మపాలుడు వధ్యశిలవద్ద మోకరిల్లి, తన కుడిచేతిని ఆ శిలమీద చాపుకున్నాడు. ఇద్దరు భటులు విచ్చుకత్తులు చేబూని హస్తాన్ని ఛేదించడానికి సిద్ధంగా నిలబడ్డారు.

"నేను లోపలికివెళ్లి ఘంటను మూడుసార్లు మ్రోగిస్తాను. మూడోసారి ఘంట మ్రోగిందే తరువాయిగా మీరు కత్తిని కిందికి విసరి చేతిని ఖండించాలి" అని భటుల్ని హెచ్చరించి కాలవర్మ చెఱసాలలో ఒక మూలగా వున్న గదిలోనికి వెళ్లాడు.

భటులు ఘంటానాదంకోసం ఎదురుచూస్తూ విగ్రహాల్లా నిలబడ్డారు. ఘంట మొదటిసారి మ్రోగింది. రెండోసారి మ్రోగింది. కానీ మూడోసారి మ్రోగలేదు. ఎత్తిన కత్తుల్ని ఎత్తినట్టే పట్టకుని భటులు తెప్పపాటులేని కళ్లతో కాలవర్మ వెళ్లిన వైపే చూడసాగారు. ఒకటిరెండు నిమిషాలు నిశ్శబ్దంగా నే గడచిపోతూయి. ఘంట మ్రోగనేలేదు.

కాలవర్మగదినుంచీ బయటికి పరుగెత్తి వచ్చాడు. అతడి ముఖం వికృతంగా మారిపోయివుంది. అతడు సుడిగాలిలా వధ్యశిల దగ్గరకు పరుగెత్తివచ్చి "ధర్మపాలుడు నిర్దోషి. దోషిని నేను. పాపం నాది, ప్రాయశ్చిత్తంకూడా నాకే! ఊఁ నరకండి. నాచేతిని నరకండి" అన్నాడు.

భటులుపైకెత్తిన కత్తుల్ని క్రిందికి విసిరారు. కాలవర్మ కుడిచేయి అతడి శరీరంనుంచి వేరైపోయింది.

* * * *

ఈవార్త గాలిలా క్షణాల్లో శ్రావంతి నగరమంతటా వ్యాపించి పోయింది. ఒకవేళ కాలవర్మే నిజంగా దోషి ఐనప్పటికీ, అతడు తననేరాన్ని తనకుతానుగా ఎందుకు ఒప్పుకున్నాడో తెలియక పురజనులందరూ విస్మయచకితులై పోయారు.

అసలు జరిగినసంగతి యిది:

కాలవర్మ గదిలోపలికి వెళ్లి, ఘంటకు కట్టబడివుండిన త్రాటిని పట్టి అటూ, ఇటూ లాగాడు. ఘంట మొదటిసారి మ్రోగింది. అది మ్రోగుతూవుండగానే, చేతి మణికట్టుకు దగ్గరగా సూదితో పొడిచినట్టు చురుక్కుమని నొప్పి కలిగినందువలన కాలవర్మ 'ఏమిటా' అని పైకి చూచాడు. రెండోసారి చురుక్కుమన్నది. కాలవర్మ కళ్లు గిఱ్ఱున తిరిగినాయ్. ఘంటత్రాటినుంచీ ఒక భయంకరమైన సర్పం క్రిందికి దిగుతున్నది!

ఆపాముకాటుకు విరుగుడులేదని కాలవర్మకు తెలుసు. ఉన్నది ఒకటేమార్గం. విషం శరీరమంతటా వ్యాపించేలోపుగా చేతిని నరికి వేయాలి. లేకుంటే ప్రాణాలు దక్కవు!

కాలవర్మ మూడోసారి ఘంటను మ్రోగించకుండా, వధ్యశిలవైపుకు పరిగెత్తింది అందుకే! ★

---

భయాన్నిగూర్చి పంతులుగారు పాఠం చెబుతున్నారు. ఆయన పిల్లల్ని ఎవరెవరికి ఏమి భయమో అడుగుతున్నారు. అందులో ఒక కుర్రవాడు లేచి ఇలా చెప్పాడు.

"నాకు చాలా భయాలు ఉన్నాయ్. కానీ మా నాన్నకు మా అమ్మంటే ఐతే భయం!" అన్నాడు.

* * *

ఒకడు (పోలీసుతో) : అయ్యో! నారూపాయి పోయిందండీ!

పోలీసు (విసుగుతో): అది కాతి కివ్వడానికి రెండురూపాయ లివ్వు.

* * *

ఒకడు (రోగితో): ఆదేమిట్రా కళ్ళు మూసుకు అన్నం తింటున్నావ్!

రోగి: జబ్బు నయమయ్యే వరకు డాక్టరుగారు అన్నముఖం చూడొద్దన్నాడుగా.

—కోటంరాజు మధుసూదనరావు, తెనాలి.

---

పెద్ద కథ:

#  వాసు చదువు 

(గతసంచిక తరువాయి)

**5**

పట్నం చేరుకున్న వాసుకి, ఆరోడ్లు, యిల్లు, కార్లు, చివరకి మనుషులు సహితం వింతగా కన్పించారు. ఇక తనుండవల్సిన యిల్లు, అంటే వరహాలు యిల్లు దేవేంద్ర భవనంలా తోచిందతనికి. కాని పగలంతా చీకటికొట్టులా వుండేది. సాయంకాల మవటంతో యేదో కొత్త లోకంలో వున్నట్టనిపించింది.

వరహాలు మనుమలు కామేశం, విశ్వం, వాసుని చూచి నవ్వుకున్నారు. ఎందుకు నవ్వారు? అంతా పల్లెముస్తాబు వాసుది. జుత్తు యెప్పుడూ చిందర వందరగా యెగురుతూనే వుంటుంది. బట్టలు శుభ్రంగావున్నా అన్నీ పొట్టివే. ఇవే వాళ్ళనవ్వుకి కారణాలయ్యాయి. కాని వాసు మనోనిగ్రహం కలవాడవటం వల్ల తనూ నవ్వేసి వూరుకున్నాడు. కామేశం తల్లి సీతాలక్ష్మి వాసునిచూచి మూతి విరుచుకుంది. వాసు తనింట్లో అడుగు పెట్టడం ఆమెకి సుతరామూ యిష్టంలేదు.

క్రిష్ణారావు వరహాలు సవతి కొడుకు. వరహాలు వుంటున్న యింటివెనుక భాగంలోనే అతనూ వుంటున్నాడు. అతడు హైస్కూల్లో ఉపాధ్యాయుడు పల్లె నుండి రావటంతోనే మేనల్లుణ్ణి క్రిష్ణారావు దగ్గరికి తీసుకుపోయింది. వాసు మొదట్లో క్రిష్ణారావు గారి గంభీరాకారం చూచి భయపడి పోయాడు.

"ఈ అబ్బాయేనా, మీఅన్న కొడుకు పిన్నీ" అన్నాడు క్రిష్ణారావు ఆమాటల్లో యెంతో సౌమ్యత అగుపించింది వాసుకి.

"ఔనురా" అందివరహాలు

వాసుకి యెదురుగావున్న జామి చెట్టుపైదృష్టి పడింది. ఎక్కడేనా

**ముద్దంశెట్టి హనుమంతరావు**

కాయలున్నాయేమోనని దీక్షగా చూస్తున్నాడు. క్రిష్ణారావు మాస్టరు అదిగమనించి

"వెళ్ళితీసుకోవోయ్ - పండిన కాయలేవున్నయ్" అన్నాడు. 'ఆకారంచూసి భయపడ్డానుగాని, చాలా మంచి వాడిలా వున్నాడే' అనుకున్నాడు మనస్సులో వాసు. అనటమే తడవుగా చెట్టుదగ్గరికి పోయాడు వాసు.

"కుర్రాడు చురుకైన వాడిలా కనిపిస్తున్నాడు పిన్నీ" అన్నాడు క్రిష్ణారావు.

"తెలివైన వాడు కూడాను... అయిదోక్లాసులో యినస్పెక్టరు వీణ్ణి యెంతో మెచ్చుకున్నాట్ట" అంది వరహాలు నవ్వుతూ.

"అయుండొచ్చు - మొహం చూస్తేనే తెలుస్తుంది ... నేనిప్పుడడిగి తెలుసుకుంటానుండు." అన్నాడు క్రిష్ణారావు. అప్పటికింకా కాయలున్న కొమ్మని అందుకోబోతున్నాడు వాసు వరహాలు పిల్చింది. వాసుతిరిగి వస్తుంటే

"కాయ తీసుకొన్న తరువాతే రావోయ్" అన్నాడు క్రిష్ణారావు.

"ఫరవాలేదండి" అంటూ చేతులు ఫేంటుకి తుడుచుకుని వచ్చాడు వాసు.

క్రిష్ణారావు అతని బుద్ధికి మెచ్చుకున్నాడు మనస్సులో

"అబ్బాయ్, అయిదోక్లాసుపాసయ్యావు కదూ?"

"ఔనండి..." చేతులు కట్టుకుని చెప్పాడు వాసు

"నీకింకా యెక్కువ చదువుకోవాలని వుందా?"

"ఔనండి..."—అందుకే మా నాన్న పంపారు" అమాయకంగా అన్నాడువాసు.

"అవుతే, యేదీ చెప్పు ... మొగలు సామ్రాజ్యాన్ని యెవరు స్థాపించారు?"

"బాబరండి" తడుముకోకుండా చటుక్కున చెప్పాడు వాసు.

అదొక్కటే కాకుండా యింకా అనేక విషయాలు అడిగాడు క్రిష్ణారావు. అన్నింటికి సరైన జవాబులు చెప్పాడువాసు. క్రిష్ణారావు వాసుని

వెళ్ళి పొమ్మన్నాడు. వాసు జామికాయ సంగతే మర్చిపోయి యింటికి పోయాడు.

"మీ మనుమల కంటె తెలివైనవాడు విన్నీ... ఫస్టుఫారంలో వేయించినా ఫరవాలేదు...యిల్లాంటి వాళ్లు చదువుకోవటం మంచిది" అని తన అభిప్రాయం వెల్లడించాడు క్రిష్ణారావు.

"నువ్వే తీసుకపోయి జాయిన్ చేయించరా..." అంది నవ్వుతూ వరహాలు.

"అలాగేవిన్నీ" అన్నాడు క్రిష్ణారావు, తరువాత వరహాలు అక్కడి నుండి వెళ్లిపోయింది. క్రిష్ణారావు భార్య భర్తకిదగ్గరసా వస్తూ

"కుర్రాడు చాలబుద్ధి మంతుడిలా వున్నాడండీ" అంది.

"ఔను... పిల్లలకి తర్ఫీదివ్వటంలో వుంది వాళ్ళ భవిష్యత్తు" అన్నాడు క్రిష్ణారావు.

వరహాలు యింట్లోకి పోయి చూచింది గదా, వాసు ఒంటరిగా కూర్చుని యేదో ఆలోచిస్తూ మేనత్తరావటమే గమనించలేదు. వరహాలు లోలోపల నవ్వుకుంది.

"ఏంరా ఇక్కడ ఒంటరిగా కూర్చున్నావ్? కామేశం, విశ్వం, ఆ గదిలో కూర్చున్నారు కదూ వెళ్లు...... పరాయి వాళ్ళలాసిగ్గెందుకూ?" అంది.

అలాగేనని తల మాత్రం వూపాడు వాసు. కాని వాళ్ళ దగ్గరకి వెళ్లేందుకు సంకోచిస్తున్నాడు. ఎందుకూ అంటే వాళ్లిద్దరన్నదమ్ములు తనను హేళనచేస్తారేమోనన్న భయం వుండటనికి. అలాగని యెంతకాలం వాళ్లకిదూర దూరంగా తిరుగుతాడు? ధైర్యం చేసి వెళ్లాడు. వాళ్లిద్దరూ చీట్లపేక ఆడుకుంటున్నారు.

"ఆడతా వేమిటోయ్ వాసూ?" అన్నాడు విశ్వం. అలా అన్నప్పుడు నవ్వలేదుకూడా. ఆమాత్రం మర్యాదిచ్చి మాట్లాడినందుకు విశ్వాన్ని మెచ్చుకున్నాడు మనసులో.

"నాకీ ఆటరాదు విశ్వం...మీరాడండి - నేను చూస్తా" అన్నాడు వాసు. అతని కాశ్చర్యం వేసింది,



పల్లెటూరు

—టి. ఆదినారాయణ (14) ధర్మవరం.

 # వాసు చదువు 

విశ్వం అంత చిన్నతనంలో ఆ ఆట యెలా నేర్చుకున్నాడా, అని.

"నీ పని చూడ్డమేలే...నీదంతా పల్లెటూరి తెలివి. ఇల్లాంటి వేమీ చేతకావు." అన్నాడు కామేశం నవ్వుతూ. అతడిమాటలు కటువుగా హృదయానికి తగిలినయ్ వాసుకి.

"వూరుకో అన్నయ్యా! పాపం అతడే సిగ్గుపడుతుంటేనూ" అని గదమాయించాడు విశ్వం. కామేశం యింకా నవ్వుతూనే వున్నాడు యెగతాళిగా. వాసు ఆ నవ్వుని అంతగా పట్టించుకోలేదు.

అప్పుడే వాసు వారిద్దరి మనస్తత్వాలు తెలుసుకొన్నాడు. కామేశం యెప్పటికైనా మనసిచ్చి మాట్లాడడు, అతని హృదయం కపటమయిందని అర్థం చేసుకొన్నాడు. అందుకే విశ్వంతో యెక్కువ చనువుగా తిరుగుతుండేవాడు.



—ఫోటో: యస్. ప్రసాదరావు.

## 6

వాసు పరీక్ష ప్యాసై షష్ఠ ఫారంలో చేర్చబడ్డాడు. క్లాసు మాస్టరు కూడా అతని తెలివితేటలకి అచ్చెరువందాడు. పల్లెటూరి బడికంటె కొత్త బడిలో యెన్నో వింతలు చూశాడు వాసు...సరికొత్త మేజా బల్లలు, పీరియడ్ తెలియజేసే గంటలు, రకరకాల విద్యార్థులు...యివన్నీ వింతగానే కన్పించాయి. కొన్నాళ్లవరకు గాని క్లాసులో యెవరితోనూ స్నేహాం కలుపుకో లేకపోయాడు.

పట్నం పోయాక వాసు వేషం చాలమట్టుకు మారిపోయింది. ఉన్న కొద్దిబాటి దుస్తులు శుభ్రంగా వుంచుకోవటం, తల నున్నగా దువ్వుకోవటం, రోజుకి రెండు సార్లు మొహం సబ్బుతో కడుక్కోవటం, యివన్నీ నేర్చుకున్నాడు.

పట్నం వచ్చేసి నెలరోజులయింది. ఓసారి పల్లె పోవాలనుకొన్నాడు. ఓ ఆదివారం వుదయం కాలినడకనే పల్లెటూరికి బయలుదేరాడు, అట్టే దూరం లేదుగనక. ఇల్లుచేరటంతో తల్లి వాసుని కౌగలించుకుంది. సూర్యనారాయణ క్షేమసమాచారాలు, అక్కడి పరిస్థితులు అడిగాడు. అన్నీ సవ్యంగా వున్నట్టే చెప్పాడు వాసు.

స్నేహితుడొచ్చాడని విన్న ధర్మారావు వెంటనే వాసు దగ్గరికి పోయాడు. ఒకరి నొకరు చూసుకుని నవ్వుకున్నారు. ఇంట్లో వుంటే మాట్లాడే స్వేచ్ఛ వుండదని యిరువురూ వూరిబయట గుడిదగ్గరకి పోయారు. అప్పటికి వుదయం తొమ్మిది గంటలవుతుంది. అప్పుడే సూర్యుడు వెచ్చగావున్నా, యెండ

తీవ్రంగానే వుంది. ఇరువురూ చెట్ల నీడని కూర్చున్నారు.

"ఎలా వున్నావ్ ధర్మా?" అన్నాడు వాసు అతడి మొహం లోకి చూస్తూ.

"నామాట కేంగానీ, నీ సంగతి చెప్పూ? స్కూల్లో చేరావా?" అన్నాడు ధర్మారావు తనో లెఖ్ఖలో వ్యక్తి కాదన్నట్టుగా.

"ఫస్టు ఫారంలో చేరానురా! నిజంగా పట్నంలో వుంటే స్వర్గంలో వున్నట్టే వుంటుంది. ఆ రోడ్లు, ఆ జనం, మోటారు కార్లూ, యివన్నీ చూస్తుంటే యెంతో హాయనిపిస్తుంది. సినిమా కూడా వుంది— మొన్ననో సినిమా చూశాను. ఎంత బావుందనుకున్నావ్?"

"అక్కడ నదివుందా?"

"వుందిగాని, చాల దూరం మా ఇంటికి ... నేనెప్పుడూ పోను. ఇంట్లోనే కూర్చుంటా. ఆ యిల్లు కూడా యెలావుందనుకున్నావ్, పెద్దయిల్లే ... విద్యుద్దీపాలున్నయ్. రాత్రులు కూడా పగల్లానే వుంటుంది. అన్నట్టు మర్చిపోయాను – నీ చదువుగురించి మీ నాన్నగారేమన్నారు?" అన్నాడు వాసు. ధర్మారావు ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఏమంటాడు? పాత పాటే! యీ సంవత్సరం చదువు సున్నా. యింటి పరిస్థితులు బావులేవట, వచ్చేయేడు పంపుతారట" అన్నాడు ధర్మారావు నిరుత్సాహంగా.

"అదేవిటి ధర్మా, మీలాంటి కలవాళ్లుకూడా యింటి పరిస్థితులు బావులేవంటే యెవరైనా నమ్ముతారూ?"

"అదేవిటో నాకే అర్థం కాదు వాసూ: పెద్దవాళ్లు కదూ, వాళ్ల యిష్టం...నరేగానీ, పట్నం వెళ్లి నువ్వు చాలా మారిపోయావు సుమా!" అన్నాడు ధర్మారావు వాసు వేపు అదోలాచూస్తూ.

"అంటే...?" అర్థంకాక అడిగాడు వాసు.

"అంటే, నీ బట్టల్లో, ముస్తాబులో మార్పు వచ్చింది. ఇంతకు ముందు నిన్ను చూచిన వాళ్లు యిప్పుడు చూస్తే నిన్ను పోల్చుకోలేరు...గొప్ప షోకులు నేర్చావు" అన్నాడు ధర్మారావు చిన్నగా నవ్వుతూ.

"పట్నం, షోకులకి పెట్టింది పేరు ధర్మా! నే నేమూల - మొన్న మొన్న పోయిన వాణ్ణి. అక్కడి కుర్రాళ్లని చూస్తే చిత్తయిపోతావు." అన్నాడు వాసు.

"పోనీ గానీ, మన బడి పంతులు నీ గురించి అప్పుడప్పుడడుగుతూంటాడు వాసూ" అన్నాడు ధర్మారావు.

"ఇప్పుడు స్కూలుంటుంది కదూ, ఓసారి పోదాంరా" అంటూ లేచి ముందు త్రోవతీశాడు వాసు.

మిత్రద్వయం వీధి వెంట పోతూంటే చాల మంది దృష్టి వాసు వేపు మళ్లింది. కొందరసూయపడ్డారు...కొందరు సంతోషించారు. స్కూలు చేరుకుండే సరికి బడి పంతులు పిల్లలకేదో బోధపరుస్తూ వాసుని చూశాడు.

"రావోయ్ వాసూ! యెప్పుడు రావటం? అవుతే నేను జ్ఞాపకం వున్నానన్న మాట" అన్నాడు నవ్వుతూ కుర్చీలో కూర్చుంటూ. వాసు పంతులికి నమస్కరించాడు.

"అదేవిటి మాష్టరుగారూ మిమ్మల్నెప్పుడైనా మర్చిపోతానా? యివ్వాళే వచ్చాను - రేపు పుదయం మళ్లీ వెళ్లిపోతాను" అన్నాడు వాసు.

"కూర్చోవోయ్ - నిల్చుంం! పోయావేం?" అన్నాడు బడి పంతులు. వాసు ఆ పక్కనే వున్న బెంచీపై కూర్చున్నాడు. ధర్మారావు వాసు పక్కనే కూర్చున్నాడు. వాసు వేషంలో మార్పు కనిపించటంతో క్లాసులో పిల్లలందరూ అతన్ని ఓ వింత జంతువుని చూస్తున్నట్టుగా చూశారు.

"ఏ క్లాసులో జాయినయ్యావ్ వాసూ?" మళ్లీ ప్రశ్నించాడు మాస్టరు.

"ఫస్టు ఫారంలో నండి..." సవినయంగా చెప్పాడు వాసు

"చాల సంతోషం - కష్టపడి చదివి, మీ తలిదండ్రులకీ, మన వూరికీ పేరు తేవోయ్, నీలాంటి కుర్రాళ్లు వుండటం అరుదు" అన్నాడు పంతులు. వాసు తల దించుకుని నవ్వుకున్నాడు. బడిపంతులు మళ్లీ మొదలు పెట్టాడు.

"చూడు వాసూ! పట్నంలో అనేకమైన వింతలూ, విశేషాలూ, వుంటాయి. అవన్నీ చూచి మోసపోవద్దు. కొత్తకొత్త అభ్యాసాలు అలవర్చుకోవటం మంచిది కాదు. చెప్పుకోవాలంటే దురభ్యాసాలన్నీ పట్టణంలోనే ఆలవాలమైవున్నయ్;



## వాసు చదువు

ఒకరితో తగవులాడ్డం గానీ, ఒకర్ని దూషించటం గాని, విరోధాలు కలకాలం మనసులో వుంచుకోవటం గాని కూడదు వాసూ" అని హితోపదేశం చేశాడు మాస్టరు. అసలు మొదటి నుండి వాసంటే పంతులకి తీరని అభిమానం...

బడి పంతులు దగ్గర శలవు తీసుకుని ధర్మారావుతో వాళ్లింటికి పోయాడు వాసు. ధర్మారావు తండ్రి వాసునడిగి యెన్నో విషయాలు తెలుసుకున్నాడు. ఆ సమయంలోనే ధర్మారావు చదువు విషయం యెత్తాడు వాసు. వచ్చే యేడు తప్పకుండా పట్నం పంపుతానన్నాడు ధర్మారావు తండ్రి. తరువాత కాస్సేపు అవీ యివీ, మాట్లాడుకుని యిల్లు చేరుకున్నాడు వాసు.

ఒకే రోజులో యివన్నీ చూసుకోవటం వల్ల, యింట్లో వున్న కాలపరిమితి తక్కువయ్యింది. అప్పటికే పన్నెండు దాటింది. భోంచేసి కాస్సేపు నిద్రపోయాడు. మూడు గంటలకి లేచి మొహం కడుక్కున్నాడు. నెలరోజుల తరువాత వచ్చిన కొడుకోసం వెంకటలక్ష్మి 'వుప్మా' చేసింది. వాసు, సూర్యనారాయణ ఫలహారం చేస్తున్నారు.

"ఏంరా వాసూ! యింట్లో వాళ్లంతా అభిమానంగా చూస్తున్నారా?" అన్నాడు సూర్యనారాయణ.

"ఔను నాన్నా!" అని మాత్రం అన్నాడు. లేదని యెలా చెప్తాడు?

"ఆ పిల్లలతో నువ్వు తగవులాడకేం..." అంది అక్కడే నిల్చున్న తల్లి.

"లేదమ్మా! నాకసలు తగవులంటేనే యిష్టముండదు" అన్నాడు వాసు. తల్లి చిన్నగా నవ్వుకుంది.

"మళ్లీ యెప్పుడొస్తావురా?" అంది వెంకటలక్ష్మి.

"వీలున్నప్పుడంతా వస్తుంటానమ్మా" అన్నాడు వాసు. సాయంకాలం మరెక్కడికీ పోలేదు. ఆ రాత్రి యేమేమో కబుర్లు చెప్పుకుంటూ పడుకున్నారు. మరుచటి దినం కోడికూసే వేళకి లేచి వాసు పట్నం బయలుదేరి పోయాడు, సూర్యనారాయణ కొంత దూరం తెలతెల వారిన వరకూ సాగనంపి తిరిగి వచ్చేశాడు.

(ఇంకా వుంది)

# మా చిట్టి చంద్రహారం

**అర్జున్**

మా నాన్నకు మాకంటే మా చెల్లి చిట్టిఅంటే చాలా గారాబం. ప్రేమ. ముద్దు లాలికే చిట్టిబుగ్గలను చూస్తేగాని మా నాన్నకు సంతృప్తిగా వుండేదిగాదు. చిట్టి మానాన్నకు ఎంత గారాబం అంటే లేక లేక రాజుగారికి పుట్టిన కుమార్తెకు జరిగే సకలసపర్యలు జరిగేవి. ఇంటికి ఏం తెచ్చినా ముందు చిట్టికి తరువాత మాకు. మా అన్న ఆనందుగూడ అంతే! ఎప్పుడుచిట్టి! చిట్టి అని దాన్నే దగ్గరకు పిలిచి ఎత్తుకునే వాడు గాని, ఏరా! రఘు! యిలారా! అని నన్ను పిలిచిన పాపానపోలే అదేమయ్యా అంటే "అది చిన్నపిల్లరా! నీకేరా పదిసంవత్సరాలునెత్తికొచ్చాయి." అనేవాడు. చిట్టిమటుకు మహాచిన్నదేం? దానికి ఆరుసంవత్సరాలు. ఇలా వుండగా ఒకసారి మా నాన్న మద్రాసు వెళ్లాడు. వెళ్లేముందు చిట్టి నాన్నవద్దకు వెళ్లి "నాన్నా! నేను నీతో వస్తా" అంటూ మారాం చేసింది.

"లేదు చిట్టి! నా మంచి తల్లి విగా! నీవు వద్దమ్మా! మరోసారి తీసుకువెళతాలే! ఆఫీస్ పనిపై చాలా తొందరగా వెళ్లి రావాలి" అని బుజ్జగించి చెప్పాడు.

"హు! హు!" అని మరీ గోముచేసింది చిట్టి!

"నీకు మంచి సిల్కుగౌన్లు, పరికిణీలు, దండ తెచ్చియిస్తానమ్మా!" అని నాన్న దానికి ఏదో కల్లబొల్లి కబుర్లు చెప్పి మద్రాసు వెళ్లాడు. చిట్టి మహా మురిసిపోయింది నాన్న తనకు సిల్కుగౌన్లు తెచ్చియిస్తాడని. ఆ విషయం తన స్నేహితురాలగు అమ్మడికి పనిగట్టుకువెళ్లి చెప్పి వచ్చింది.

నాన్న మద్రాసులో ఆఫీస్ పని ముగించుకుని తిరిగి వచ్చేటప్పుడు మంచి చంద్రహారం ఒకటి తీసుకొని వచ్చాడు చిట్టికి. చిట్టి దాన్ని చూసి మురిసిపోయింది. ఆ హారాన్ని ఎప్పుడూ మెడలో వేసుకొని తిరుగుతూవుండేది. అమ్మ "జాగ్రత్తగా వుండవే!" అని హెచ్చరిస్తుండేది. ఆ హారాన్ని చూచినవాళ్లంతా "అబ్బ ఎంత చక్కగా వుంది. కండ్లు మిరిమిట్లు గొల్పుతున్నాయి" అనేవారు. ప్రతివాళ్లు తన చంద్రహారాన్ని ఆ విధంగా మెచ్చుకొనేసరికి చిట్టి కన్నులు ఆనందంతో మెరిసిపోయేవి.

ఇలావుండగా దసరా పండుగ వచ్చింది. నేను, అన్నయ్య అంతా శలవులు గనుక ఇంటివద్ద తిష్ట వేశాము. ఒకరోజు చిట్టి పక్కింటి అమ్మడిని పిలిచి "బొమ్మలాట ఆడుకొందాం రమ్మంది." అమ్మడికి చిట్టి వయస్సే. ఎంతో ముచ్చటగా వుండేది వాళ్ల స్నేహం. అమ్మడు, చిట్టి ఎవరిబొమ్మలు వాళ్లు తెచ్చుకొని మా మేడపైకి వెళ్లి ఆటలాడుకొ మొదలుపెట్టారు. వాళ్లు ఆడుకొనేవైపు మా మేడపైకి వేపచెట్టు కొమ్మలు ప్రాకివున్నాయి. ఆ చెట్టుపై కోతులు గంతులు వేస్తూవుంటాయి.

అమ్మడు, చిట్టి కలసి కొంత సేపు అలా ఆటలాడుకొన్నారు. చిట్టి తన చంద్రహారం బొమ్మ మెడలోవేసి దాని అందచందాలకు ఎంతో ఆనందించింది. ఇంతలో క్రిందనుండి అమ్మ ఓసారి వచ్చి వెళ్లమని కేకవేసేసరికి అమ్మడితో "బొమ్మలను భద్రంగా చూస్తుండ" మని చెప్పి క్రిందికి వెళ్లింది చిట్టి. అమ్మడు తన బొమ్మలకు కావలసిన శృంగారాలు, సవరింపులు చేసుకుంటూ ఆ పనులలో మునిగిపోయింది! ఇతర విషయాలు ఏమీ గమనించకుండా! అంతవరకు మర్రిచెట్టుపై ఒక కోతి వీళ్ల ఆటలు చూస్తుండింది. చిట్టి క్రిందికి వెళ్లగానే మేడపైకి వచ్చి చిట్టి బొమ్మ మెడలో వ్రేలాడే చంద్రహారాన్ని యిట్టే తీసుకొని క్షణంలో చెట్టుపైకి వెళ్లిపోయింది. అమ్మడికి యీ విషయం ఏం తెలియదు పాపం! తన బొమ్మలు, తను తప్ప! ఓ అరగంట తరువాత చిట్టి మేడపైకివచ్చి "అమ్మ క్రిందికి రమ్మంటున్నాది! వెళతాను" అని తన బొమ్మను చూసేసరికి చంద్రహారం కాస్తా మాయమైపోయింది. చిట్టి అమ్మడినడిగింది "చంద్రహారం తీసుకొన్నావా?"

"ఏ చంద్రహారం! నీ చంద్రహారమా! నాకు తెలియదే" అంది అమాయకంగా అమ్మడు.

"హు! హు! నీవే కొట్టావ్! నీవే తీసుకొన్నావు! చూడు మా

## ★ మా చిట్టి చంద్రహారం ★

నాన్నతో చెప్పి నిన్ను ఏం చేయిస్తానో" అంటూ ఏడుస్తూ క్రిందికి పోయింది చిట్టి.

అమ్మడికి చంద్రహారం మాయం కావడం చాల విచిత్రంగా వుంది. చిట్టి అన్న మాటలకు ఖిన్నురాలై ఇంటికి వెళ్ళి వాళ్ళ నాన్నతో జరిగిన సంగతి అంతా చెప్పింది అమ్మడు!

వాళ్ళ నాన్న సాయంకాలం మా యింటికి వచ్చి నాన్నతో ఈ విషయం వివరాలు అడిగి తెలుసుకొన్నాడు. మా నాన్నకు కూడా అమ్మడు చంద్రహారం దాచేస్తుందని నమ్మకం లేదు. నాన్న, అమ్మగారు వాళ్ళ నాన్నను మేడపైకి తీసుకొని వెళ్ళి ఆ ప్రదేశం అంతా చూశాడు. ఎక్కడ చంద్రహారం కనుపించలేదు. అమ్మడు వాళ్ళ నాన్న దృష్టియటుకు చెట్టు పై కూర్చుండి కిచకిచలాడే కోతిపై పడింది. ఒక్కసారి తలపంకించి "ఏముందీ! రావుగారు! రేపీపాటికి దొంగను పట్టి మీ చంద్రహారం యిచ్చేస్తానండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. దొంగను ఎలా పట్టారా అని నాన్న నిర్ఘాంతపడిపోయారు. అమ్మడు నాన్న తిన్నగా యింటికి వెళ్ళి వాళ్ళ నౌకరును పంపి మా వీధి చివరనివున్న కోతుల రామయ్యకు కబురు చేశాడు. రామయ్య వచ్చి "ఏం బాబు! కబురు చేశారట" అనగానే "ఏం లేదోయి! రేపు పొద్దున ఓసారి నీ కోతులన్ని తీసుకొని రావుగారింటివద్దకు రా" వని వుంది! మంచి బహుమానం యిస్తారేం!" అన్నాడు. సరే అని రామయ్య వెళ్ళాడు. అమ్మడిని కేకేసి, తనతోపాటు వెంటబెట్టుకుని బజారుకు వెళ్ళి మా చిట్టి చంద్రహారం మాదిరి యిమిటేషన్ పేరల్సు చంద్రహారాలు నాలుగు ఖరీదు చేసి యింటికి తీసుకొని వచ్చాడు.

మరునాటి వుదయం రామయ్య తన 4 కోతులను వెంటతీసుకొని మా యింటికి వచ్చాడు. నాన్నకు, నాకు విషయం ఏం అర్థంకాలేదు. ఇంతలో అమ్మడు నాన్న వచ్చాడు. వస్తూనే రాముడిచేతికి యిమిటేషన్ చంద్రహారాలు యిచ్చి "ఓరే! ఆహారాలని కోతుల మెడలో వేయరా!" అన్నాడు. రామయ్య మొదట సంకోచించినా ఆవిధంగానే చేశాడు "ఇక యిపుడు వీటిని మేడపైకి తీసుకొని వెడదాం రండి!" అని నాన్నను, కోతులను తీసుకొని పైకి వెళ్ళాడు. "ఇంక ఆకోతుల కట్లు విప్పివేసేయి రామయ్యా!" అని వుత్తరువు చేశాడు. రామయ్య ఆవిధంగానే వాటి కట్లు విడిపించాడు. విడిపించడమే తడవుగా అవి పరుగెత్తుకు వెళ్ళి మర్రి చెట్టు ఎక్కి కూర్చున్నాయి. మొదటి కోతి కొత్తగా వచ్చిన కోతుల మెడల్లో హారాలు వుండడం చూచింది. పరుగుపరుగున చెట్టు మొదలో వున్న మర్రిచెట్టుతొర్రలో చేయి పెట్టి యిట్టె మేము చూస్తుండగానే చిట్టి చంద్రహారం తీసింది. ఇవతలకు తీసి తన మెడలో వేసుకొని మిగిలిన కోతులతోపాటు గంతులు వేయసాగింది. అమ్మడినాన్న ఆదృశ్యాన్ని నాన్నకు చూపాడు "అదుగోనండీ! అసలు దొంగ!" అని కోతినిచూపాడు. నాన్న ఆదృశ్యం చూసి ముక్కుమీద వేలువేసుకొన్నాడు. రామయ్య చెట్టెక్కి కోతినిపట్టి చంద్రహారం తెచ్చి యిచ్చాడు. అమ్మడిచేత చిట్టికి యిప్పించాడు అమ్మడి నాన్న. కోతులరామయ్యకు అయిదురూపాయలు బహుమానంగా యిచ్చాడు అప్పటినుండి, అమ్మడు, చిట్టి ఎంతో అన్యోన్యంగా వున్నారు. ఇక కథ కవరులోకి, కలం జేబులోకి. ★

## "ఏలుబడి"

### పెద్ద కథ

రచన: జి. పార్వతి



17-11-1954 వారపత్రిక మొదలు "వనితాలోకం" శీర్షికలో శ్రీమతి జి. పార్వతి రచించిన "ఏలుబడి" అను పెద్ద కథ ప్రచురించబడుతుంది. సం॥

# విజ్ఞానవీధులు

"డాకర్"

## చిట్టిప్రశ్నలకు జవాబులు

డా. విజయమోహనరావుగారు, విజయవాడ.

—గ్రహణాలు ఫలానినాడు ఫలాని విధంగా కనపడతాయని మన సిద్ధాంతులు చెప్పేటందుకు ఆధారమైన సూత్రాలూ, ఆధునిక శాస్త్రజ్ఞులు చెప్పేటందుకు ఆధారమైన సూత్రాలూ అసలులో ఒకటే. అయితే భారతీయ సిద్ధాంతులు క్రీ. శ. ఆరూ ఏడూ శతాబ్దాల తరువాత సొంత పరిశోధన మానుకుని అప్పటికి తెలిసిన సూత్రాలవల్లనే పంచాంగాలు గుణించడము మొదలుపెట్టి నేటివరకూ సాగించారు. ఆ పద్ధతులతోపాటు ఆ రోజులలో గ్రహణాలను గురించి వాడుకలోనుండిన 'పాము మింగడపు' నమ్మకాలూ, స్నానావసరపు నమ్మకాలూ నేటిదాకా దిగివచ్చినవి. ఇలాగు స్నానాలుచేసే పండితులే రాహుకేతువులను 'ఛాయాగ్రహాలు' అనగా 'నీడలు' అంటారు. మరి పాము అనగా యేమిటో?

* * *

టి. యస్. రాజశేఖర్, కోటపల్లి గూడూరు.

—రాడారు విద్యుదయస్కాంత తరంగములను (అనగా కనబడని వెల్తురు కిరణాలను) పుట్టించే సాధనము. ఈ తరంగాలు ఏ ఎరోప్లేనుకో పోకి తిరిగివచ్చినప్పుడు మళ్లీ వాటిని గ్రహించగల సాధనము కూడాను. పంపేకాలానికీ, తిరిగి గ్రహించే కాలానికీ నడుమగల అంతరమునుబట్టి ఎరోప్లేను రాడారుకు ఎంత దూరములో ఉన్నదో లెక్కగట్టవచ్చును.

కొందరు ప్రజ్ఞావంతులు తమ భావాల్ని రాడారులవలె ప్రసారించగలరు. కొంద రితరులు ఈ తరంగాలను గ్రహించి తర్జుమా చెయ్యగలరు. మెస్మరైజు చేయబడి కంటిమీద గుడ్డ కప్పబడిన కుర్రవాడు గారడీవాడు స్పృశించిన వస్తువు పేరుచెప్పడము వినలేదా మీరు? అయితే ఇక్కడ గారడీవాడు పంపిన తరంగాలను కుర్రవాని మెదడు గ్రహిస్తున్నది గాని వాటినే మళ్ళీ వెనక్కి పంపడము లేదు అదీ తేడా.

—వెంట్రుకలను తయారుచెయ్యవలసిన అవసరము ఇంకా మానవకోటికి కలగలేదు. కాని అవసరమైతే చేసుకోగలరు.

[illegible] ఒకదానికొక ఒకటి చేరినట్టుగా [illegible] అణువులు (*Molecules*) పేర్చబడిఉన్నాయి. ప్రతి అణువూ కానీవలెనే పేర్పుడుదానియొక్క పొడవునకు లంబముగా – అంటే అడ్డముగా విస్తరించేది. పేర్పుడుమాత్రము నిలువుగా సాగిపోతుంది. ఈరీతి పేర్పుడుగల ప్లాస్టిక్ దారాలు తయారుచేస్తే వెంట్రుకలను తయారు చేసినట్లే.

—మెదడువలెనే చెప్పిన సంగతులను 'జ్ఞాపకము' ఉంచుకోగల ఎలక్ట్రానిక్ యంత్రాలు తయారు చేస్తున్నారు. ★

## కాలక్షేపం

(4-వ పేజీ తరువాయి)

మోజుపోయింది రేడియోలు రాగానే - రేడియోలు చవుకఅయిపోతే, కాఫీహోటలులో రేడియో, కారులో రేడియో, జేబులో రేడియో, "పానీయంబులు త్రావుచున్, కుడుచుచున్ భాషించుచున్ హాసలీలా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్" రేడియో పాడుతూ ఉంటే పితుకకుండానే పాలు ప్రవహించినట్లుగా, చెవిలో సంతతధారగా రేడియో పాడిన గానరసం పడుతూఉన్నట్లయితే, ఆ రసం నీరసం అవుతుంది. దేశంలో పాడిపంటలకంటె రేడియో పాడి ఎక్కువై ఎక్కసమవుతుంది. ప్రారంభ కాలంలో దానియందున్న మోజు చివరి రోజులలో ఉండదు. గరంగరంగా ఉండేది తాజామాల్. రేడియో వేడి కూడా చల్లారిపోతుంది. అప్పుడు రేడియోను మించిన ఏ గారడీయో మరొకటి అవతరించాలి. ఈవిధంగా, మనకు కోరికలు కొన్ని కలుగుతూఉండడం, వాటిని సాధించడంకోసం శాస్త్రం పరిశోధించడం, మనం సాధించిన కోరికలే చివరకు మనలను బాధించడం జరుగుతుంది.

అందుచేతనే, అంతుచిక్కని విద్య ఎంత నేర్చినా ఒక్కటే అన్నారు. బంగారం చెయ్యడం నేర్చుకోవడంకంటే, బంగారాన్ని గౌరవించడంకంటె, బంగారానికి నమస్కారాలు చెయ్యడంకంటె, నిన్ను నీవే బంగారంగనిశనిశోధించిమధించి తెలుసుకో అన్నారు ఆర్యులైన తత్వవేత్తలు. ఇతరులను ఆకర్షించి వశపరచుకోవలెనంటే ప్రయత్నంకంటె, నీ శక్తిని నీవే గ్రహించి వశపరచుకో అన్నారు - నీ ఆత్మను నీవు వశపరచుకుంటే జగత్తంతా నీకు వశమైనట్లే అన్నారు. నీలోఉన్న అనంతశక్తిని నీవు తెలిసికొనడమే బ్రహ్మవిద్య అన్నారు. దానివల్ల నీకు కలిగే బ్రహ్మానందమే మోక్షం అన్నారు. అనంతమైన యీ జగత్తును నడిపించేటటువంటిశక్తినీలో నేఉన్నదన్నారు. "తత్ త్వం అసి" అదే (అ బ్రహ్మాస్) నీవు అగుచున్నావు అనే ఒక్క ముక్కలో విద్య అంటే ఏమిటో వివరించారు. మిగిలినదంతా అవిద్య, అవివేకం, అని లోకం గ్రహించాలి. అణువులో ఉన్నది అనంతమైన శక్తి అని గ్రహించినట్లుగా ఆత్మశక్తి తెలిసికొనడమే అనంతమైన విద్య - "చిత్తంబు మత్ప్రభుకుంబునకు నెంతో విద్య దాభిరామ వినుర వేమ!"

"తత్ త్వం అసి" అనే ఒక్క ముక్కలో ఉన్నదే విద్య. ఆకర్షణశక్తి అనేది బ్రహ్మాండమంతటనూ ఉంది. ఒక గ్రహాన్ని ఇంకొక గ్రహం ఆకర్షిస్తుంది. ఒకఅణువును ఇంకొక అణువు ఆకర్షిస్తుంది. ఒకజీవిని ఇంకొకజీవి ఆకర్షిస్తుంది. ఎంత దూరంశోధించినా ఒక్కటేశక్తి. దానిని తెలిసికొన్నకొలదీ, దానిని గురించిన మన జ్ఞానం విస్తరించినదని భ్రమిస్తున్నాము. మన ఆత్మశక్తి మనం తెలిసికొన్న తర్వాత ఇక తెలిసికోవలసినవిషయం లేదని బ్రహ్మవిద్య నుపదేశించిన బ్రహ్మవేత్తల సిద్ధాంతం. విద్యఅంటే అదే విద్యగాని, తదితరము విద్య కాదన్నారు బ్రహ్మసూత్రాలు వ్రాసిన వ్యాసమహర్షి. దానికి తక్కువైనది విద్యకాదు. దానికి మించిన విద్యలేదు. అంతకంటె విద్య పెరిగదిలేదు. అంతకంటె తరిగదిలేదు. విద్య అనేది జగత్తులో ఉన్న ఒక శక్తి. అది పెరిగేదీ లేదు. తరిగేది లేదు. "విద్య యను దివ్యధనం బఖిలార్థికోటికిన్ పూర్తిగ నిచ్చినన్ పెరుగు" అనే మాట అసత్యం. విద్య పెరుగుతుంది అనే మాట అవిద్య. అజ్ఞానం. అసత్యం.

కాని, ఆత్మజ్ఞాన మొక్కటే విద్య అనేమాట యథార్థం కాదంటే, దానిని త్రోసివేయడానికివీలులేదంటే, అటువంటి విద్య వరించి "పోదు యుగాంతపు వేళనైన" అని అంగీకరించాలి. ★



కృష్ణాపిక్చర్స్ వారి "విజయగౌరి" తాను వలచిన గుణసాగరుణ్ణి పెండ్లాడబోతున్నందుకు

ప్రకాష్ వారి "అంతేకావాలి"లో జి. వరలక్ష్మి, శ్రీరాం.

★

విజయా వారి "మిస్సమ్మ"లో దొరస్వామి, సావిత్రి, రమణారెడ్డి.





ప్రతిభావారి "రేచుక్క"లో అన్నయ్య—పేకేటి శివరాం.

# రేడియో "సక్కుబాయి"

## రేడియో నెల తెలుగుకార్యక్రమాలు

ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రంవారు అక్టోబరు 24 వ తేదీన ఎగ్మూరు మ్యూజియం థియేటరులో "సక్కుబాయి" నాటక ప్రదర్శనం ఏర్పాటుచేశారు. శ్రీ రాజరాజేశ్వరీ నాట్యమండలి వారు ప్రదర్శనంలో పాల్గొన్నారు. ఎస్. వరలక్ష్మి సక్కుబాయిగాను, రేలంగి సక్కుబాయి భర్తగాను, పి. సూరిబాబు జ్ఞానయోగిగాను, కె. రఘురామయ్య కృష్ణుడుగాను నటించారు. ఈ నాటకం బ్రాడ్‌కాస్ట్ చేశారుకూడాను.

ప్రేక్షకులు బాగా వచ్చారు. మ్యూజియం థియేటరు క్రిక్కిరిసిపోయింది. తెలుగునాటకం, అందులో ఒకప్పుడు బాగా పేరుమోగిన నాటకం 'ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు చూస్తాం' అనే ఉబలాటం, ఆలిండియా రేడియో వారి ఆధ్వర్యాన ప్రదర్శన జరుగుతోందనే గౌరవం, ఎస్. వరలక్ష్మిని స్టేజి మీద చూడాలనే కౌతుకం, ముఖ్యంగా ఊరి చూపిస్తున్న సౌకర్యం ఇవన్నీ కలిసి అంత మంది ప్రేక్షకులు హాజరు కావడానికి కారణాలయ్యాయి. లేకపోతే ఈ ఊళ్లో తెలుగు నాటకాల సంగతి ఎవరికి తెలియనిది?

రేడియోవారు చేసిన మొదటి పొరబాటు ఆ థియేటరులో ప్రదర్శన ఏర్పాటు చేయడం. దాన్ని ఎవరు దేనికి కట్టించారో గాని నాటకాలకనువైనది కాదనేది స్పష్టం. ముఖ్యమైనవాళ్ళు, ముందుగా వచ్చినవాళ్లు మంచి స్థానాలాక్రమించిన తర్వాత, నాబోటి సామాన్యులు, ప్రదర్శనకు ఆలస్యంగా అంటే, పదిహేను నిమిషాలుముందు వచ్చినవాళ్లు మూలలనున్న స్థానాల్లో కూర్చోవలసి వచ్చింది. ఆహూతులైనా కూడా కొంచెం ఆలస్యంగా వచ్చినవాళ్ళు వెనక్కి తిరిగిపోవలసి వచ్చింది. మూలల్లో కూర్చున్న వాళ్లకి స్టేజిలో సగభాగం మాత్రమే కనిపిస్తుంది. అందుచేత ప్రపంచంలో ఒకచోట పగలైతే ఇంకోచోట రాత్రి అయినట్లు సక్కుబాయి కనిపిస్తే జ్ఞానయోగి కనిపించడు; జ్ఞానయోగి కనిపిస్తే సక్కుబాయి కనిపించదు. అందుచేత సగం నాటకం శ్రవ్యం, మిగతాదిమాత్రం దృశ్యం అవుతుంది. ఈ సగం భాగ్యానికి ఇంతదూరం రావాలా అని, తరుణం మించిన తర్వాత చింతించినవారు లేకపోలేదు. ఈ ఇబ్బంది రేడియో ప్రముఖులకు స్ఫురించకపోవడం విచారకరం.

ఇకపోతే అసలు నాటకం. రేడియోవారు పూర్వపు సంగీతాన్ని ఉద్ధరించడానికి వ్యర్థప్రయత్నాలు చేస్తున్నట్టే, పూర్వపు నాటకాల కత్తును పునరుద్ధరించడానికి కంకణం కట్టుకున్నారేమో అనిపిస్తోంది. ఇరవై ముప్ఫయ్యేళ్లకిందట ఈమాదిరి నాటకాలు ప్రేక్షకులను ఉర్రూతలూగించినమాట నిజమే. ఆ రోజుల్లో హేమాహేమీలైన నటులు ఈ నాటకాలు ప్రదర్శించేవారు. వారి నటనావైదుష్యం వల్లనే ఆ నాటకాలకు విపరీతమైన పలుకుబడి కలిగింది. నటుల అభినయం, పద్యాలు పాటలు తోడై వాటికంత పలుకుబడి సంపాదించి పెట్టాయని నా నమ్మకం. పద్యాలు లేని నాటకం ఉండేదికాదు. పద్యాలులేని నాటకానికి జనం వచ్చేవారేకాదు. ఆ పద్యాలు మొన్నమొన్నటిదాకా ప్రజల నోళ్లలో ఆడుతూనే ఉన్నాయి. తుంగల చలపతి, జొన్నవిత్తుల, సానం, కపిలవాయి, యడవల్లి, బళ్లారి మొదలైన నటులు ఆంధ్ర

నాటకరంగానికి విశేషమైన ఖ్యాతి చేకూర్చారు. ఆ నటుల్లో చాలమంది ఇప్పుడు లేనూ లేరు. ఆరోజులు పోనూపోయాయి. అప్పటి ప్రజాభిరుచులు వేరు, ఇప్పటి ప్రజాభిరుచులు వేరు. ఆ నాటకాలు ఇప్పుడు చూస్తుంటే ఆ రోజుల్లో పొందిన రసానుభూతి గాని, కనీసం సానుభూతి గాని ఇప్పుడెలా కలుగుతాయి? ఒక పాత్రధారి రెండేసి మూడేసి పద్యాలు అనర్గళంగా వరసగా పాడేస్తుంటే మిగతా పాత్రధారులు సన్నివేశానికి సంబంధించిన ఏ ఆవేశంలో ఉన్నా, ఆ కాస్సేపూ దాన్ని ఉపసంహరించుకుని వింటూ నుంచోవలసిందే. అప్పటి టెక్నిక్ అది. అప్పటి అభిరుచుల ప్రకారం, ఆనాటకాలు బాగానే ఉన్నట్లనిపించేవి. వీటిని రేడియోవారు తిరిగి ఉద్ధరించాలని కాబోలు రేడియో నెల కార్యక్రమాల్లో కృష్ణతులాభారం, పాదుకా పట్టాభిషేకం, సక్కుబాయి ఏర్పాటు చేశారు. తులాభారం ఫరవాలేదనిపించింది. కాని పాదుక, సక్కుబాయి చిరాకు కలిగించాయి. రేడియోవారు ఈ నాటకాల్ని బ్రాడ్‌కాస్టింగ్ అవసరాలకోసం మార్చిన పద్ధతి దీనికి బాగా తోడ్పడివుంటుంది. సినిమాల కలవాటుపడిన ఎస్. వరలక్ష్మి కంఠ మాధుర్యం చివరివరకూ కాపాడుకోలేకపోయింది. సూరిబాబు ఎదురుగా మైక్ లున్న సంగతి మరిచిపోయి, రఘురామయ్య అది స్టేజి అన్న సంగతి మరిచి పద్యాల్లోని అక్షరాలకు తగినట్టు తాళం వేస్తూనూ, పాడారు. ఈ నాటకానికి నిర్వహణ సూరిబాబు, సమర్పణ ఎస్. వరలక్ష్మి. నిర్వహణకీ, సమర్పణకీ తేడా ఎక్కడుందో, వాటిని వేర్వేరుగా ఇద్దరికివ్వవలసిన అగత్యం ఏమిటో చప్పున స్ఫురించడంలేదు.

మొత్తం మీద ఈ నెల రోజుల కార్యక్రమాలు అన్నీ అంతంత మాత్రంగానే ఉన్నాయి. వినోద కార్యక్రమాలని పేరు పెట్టి ప్రదర్శించిన వాటిలో 'వినోదాల వీరన్న కాపు' అనేది సుమారుగా ఉంది. 'తమాషాలు – తారాజువ్వలు' అనే గంట కార్యక్రమం, రేడియో మంత్రి కేస్కార్ గారు అష్టమానం ఏ సినిమాలను నిరసిస్తూ ఉంటారో ఆ చవకబారు సినిమాల వినోదం లాగానే ఉంది. అందులో "పడుచుతనము రైలుబండి పోవుచున్నదీ వయసు వారి కందులో చోటున్నది" అని మొదలయ్యే ఒక పాట కేస్కార్ గారు వింటే "హరి హరీ, అశ్లీలము శమించుగాక" అని చెవులు మూసుకుంటా రనుకుంటాను. మొత్తానికి రేడియో కార్యక్రమాలను 'పాప్యులరైజ్' చేసే ఉద్దేశంతో అట్టహాసంగా జరపబడిన ఈ 'రేడియో నెల' వట్టి పోసంగానే మిగిలిపోయింది.

"రేడియో శ్రోత"



సాధనావారి "సంతానం"లో మాస్టర్ నాగేశ్వరరావు.

## బొంబాయిలో బాల చిత్రోత్సవం

బొంబాయి రాష్ట్ర మహిళామండలివారు నవంబరు 21 న బాలచిత్రోత్సవం ఏర్పాటు చేస్తున్నారు. డా॥ బి. వి. కేస్కార్ గాని విజయలక్ష్మి పండిట్ గాని ఉత్సవం ప్రారంభింపవచ్చును. 22 వ తేదీనుండి 27 వరకూ జరిగే ఈ ఉత్సవంలో యూరప్, ఆసియా దేశాలనుండి వచ్చిన వివిధ బాలచిత్రాలను ప్రదర్శిస్తారు. రష్యా, బ్రిటన్, అమెరికా, చెకోస్లొవాకియా, యుగోస్లావియా, చైనా, ఫ్రాన్సు, జపాన్, జర్మనీ దేశాల్లో పిల్లల కోసం ప్రత్యేకంగా తయారైన కథా చిత్రాలను, కార్టూన్ చిత్రాలను, కీలుబొమ్మల చిత్రాలను ప్రదర్శిస్తారు. పెద్దల వినోదంకోసం తయారైన చిత్రాలనుండి పిల్లల దృష్టిని మరల్చడానికి, పిల్లలచిత్రాలు మనదేశంలో తయారు కావలసిన అవసరాన్ని ప్రజల దృష్టికి, నిర్మాతల దృష్టికి తేవడానికి ఈ ఉత్సవం ఏర్పాటు చేస్తున్నట్లు మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి మీనాక్షీ బాక్లే ప్రకటించారు.

## డాక్యుమెంటరీల నిలుపుదల

ప్రభుత్వంవారు సప్లయిచేస్తున్న డాక్యు



"కాళహస్తి మహాత్యం"లో మాలతి, లింగమూర్తి, కుమారి.

మెంటరీలను, వార్తా చిత్రాలను నిర్బంధంగా ప్రదర్శించవలసి రావడం పౌర హక్కులకు భంగం కలిగిస్తున్నందున, సుప్రీం కోర్టు తీర్పు దృష్ట్యా తాము వాటిని నిలుపుచేయాలని తీర్మానించామని ఆంధ్ర ఫిలిమ్ వాణిజ్య మండలివారు తమ తీర్మానాన్ని సమర్థిస్తూ ప్రకటించారు. ప్రతి ప్రదర్శనలోనూ, 2000 అడుగులకు తక్కువ కాని డాక్యుమెంటరీలను, వార్తా చిత్రాలను ప్రదర్శించాలని సినిమటోగ్రాఫ్ చట్టం నిర్దేశించడం, మూడంకెల దాకా ఉన్న రుసుమును ఈ చిత్రాలపై ప్రతినెలా ప్రభుత్వానికి అద్దెగా చెల్లించవలసి రావడం వ్యాపార స్వేచ్ఛకు భంగకారులుగా ఉన్నాయని కూడా మండలి అభిప్రాయ పడింది.

విజయనగరంలోని ఆంధ్రరాష్ట్ర సినిమా ప్రేక్షక సంఘంవారు ఆంధ్ర, దక్షిణ భారత ఫిలిమ్ వాణిజ్యమండలుల తీర్మానాలను నిరసిస్తూ ఇటీవల ఒక తీర్మానం చేశారు. డాక్యుమెంటరీలను, వార్తా చిత్రాలను ప్రదర్శించడానికి వీలుగా సినిమటోగ్రాఫ్ చట్టాన్ని సవరించాలనికూడా వారు ప్రభుత్వాన్ని కోరారు.

## సినిమాలవల్ల పిల్లలు చెడిపోతారా?

**సినిమాలవల్లనే పిల్లలు చెడిపోతారనడం** సత్యదూరమనీ, పిల్లల ప్రవర్తన తలిదండ్రుల ప్రవర్తనమీద ఎక్కువగా ఆధారపడి వుంటుందనీ, సంఘంలోని పరిస్థితులు, చవకబారు నవలలు, కామిక్ కార్టూన్లు ఇవన్నీ కలిసి పిల్లలను చెడగొట్టడానికి సహాయపడతాయనీ, వీటితో పోలిస్తే సినిమాలు హానికరాలు కావనీ, ప్రసిద్ధ దర్శకుడు వి. శాంతారాం ఇటీవల ఒక వ్యాసంలో వ్రాశారు.

అయితే శాంతారాంగారు భారతీయ చిత్రాలకూ, హాలీవుడ్ చిత్రాలకూ చాలా తేడా ఉందని ఒప్పుకున్నారు. కొన్ని సినిమాలు పిల్లలమీదనే కాక పెద్దలమీదకూడా దుష్ప్రభావం కలిగిఉంటాయనీ, అయితే భారతీయ చిత్రాలు హాలీవుడ్ చిత్రాలంతగా హానికరం కావనీ ఆయన అన్నారు. హాలీవుడ్ చిత్రాల్లో కామోద్దీపక దృశ్యాలు, నేర ప్రోత్సాహక దృశ్యాలు హింస, దౌర్జన్యం ఎక్కువగా కనిపిస్తాయనీ, ఈ చిత్రాలు పిల్లలను సహజంగా అవినీతిమార్గాలను పట్టిస్తాయనీ ఆయన అన్నారు. కాని ఇవన్నీ చవకబారు హాలీవుడ్ చిత్రాలు. అటువంటి వాటిని నిషేధించడమే మంచి పద్ధతి. ఈ చిత్రాలు యూరపియన్, అమెరికన్ జీవిత విధానాలను

మాత్రమే ప్రతిబింబిస్తాయనీ, కనుక వాటిని మన దేశంలో ప్రదర్శించ వచ్చునని మన పెద్దార్లు చెప్పేదానితో నే కేక్షిభవించను. అటువంటి చిత్రాలను చూడకుండా మంచి చిత్రాలను మాత్రమే పిల్లలు చూసేట్లు తల్లి దండ్రులు జాగ్రత వహించాలి, అని శాంతారాం అన్నారు.

## చార్లీచాప్లిన్ తీయబోయే కొత్త చిత్రం

అమెరికన్ జీవితవిధానం గూర్చి తాను ఒక చిత్రం తీయబోతున్నానని, కాని అది రాజకీయ చిత్రం కాదనీ, రాజకీయాలు విసుగెత్తిస్తాయనీ చార్లీచాప్లిన్ ఇటీవల అన్నాడు. తన చిత్రం వ్యంగ్యపూరితంగా ఉంటుందనీ, అమెరికన్ రాజకీయ నాయకులను మాత్రం అందులో ప్రవేశపెట్టననీ, చిత్రంలోకి ఎక్కించవలసినంత తెలివితేటలు వారిలో కనిపించవనీ, తన చిత్రంలో వేళాకోళం ఉంటుందే తప్ప ద్వేషం కనిపించదనీ ఆయన అన్నాడు. బ్రిటిష్, అమెరికన్ నటులు ఈ చిత్రంలో పాల్గొంటారట. చాప్లిన్ వేషానికి పూర్వపు మీసాలు, చేతికర్ర ఉంటాయటగాని, అతడు మాత్రం గౌరవనీయుడైన అల్పమానవుడుగా నటిస్తాడట.

టాకీలు అసలు వచ్చివుండగూడదనే తన సిద్ధాంతాన్ని ఋజువు చేయడంకోసం, 26 ఏళ్ళకిందట విడుదలైన "సర్కస్" అనే చిత్రాన్ని తిరిగి నిర్మించడానికి ఆయన ప్రయత్నాలు చేస్తున్నాడు. "ప్రస్తుతం పారిస్‌లో "మోడరన్ టైమ్స్" చిత్రం పొందుతున్న విజయంచూస్తే అసలు సినిమాలు మాట్లాడడం మొదలెట్టి ఉండగూడదని నాకు అనిపిస్తోంది." అని చాప్లిన్ అన్నాడు.





"అమరసందేశం"లో రేలంగి.

## భారతీయ చిత్రాలపట్ల రష్యన్ల ఆసక్తి

సోవియెట్ అంతటా ప్రదర్శింపబడిన భారతీయ చిత్రాలను లక్షలాది ప్రజలు ఆసక్తితో చూచి ఆనందించడం మన సినిమా చరిత్రలో అతి ముఖ్యమైన సంఘటన. అమెరికాలోను, యూరప్‌లోను మార్కెట్ సంపాదించుకోలేకపోయిన మన చిత్రాలు ఇంత త్వరితంగా సోవియెట్ ప్రజల ఆదరం పొందడం మనవారికి నిజంగా గర్వకారణం. ఏటేటా ఇదే విధంగా భారతీయ చిత్రాలు రష్యాలో ప్రదర్శింపబడినట్లయితే ఆర్థికంగానూ, సాంస్కృతికంగాను మన సినిమా పరిశ్రమకు ఎన్నో లాభాలు చేకూరతాయనడం అతిశయోక్తి కాదు. అయితే ఇకమీదట



"వాహినివారి "బంగారుపాప"లో ఒక దృశ్యం.

రష్యావెళ్ళే భారతీయ చిత్రాలు దేశీయభావ అన్నిటికీ ప్రాతినిధ్యం వహించేటట్లు చూడడం అవసరం. ఈసారి అన్నీ హిందీ చిత్రాలే రష్యా వెళ్లాయి. ఇకనుంచి అయినా, తెలుగు, తమిళం, బెంగాలీ, మరాఠీ చిత్రాలను హిందీ చిత్రాలతో పాటు పంపించడానికి భారత ప్రభుత్వమూ, సినిమా నిర్మాతలూ శ్రద్ధ వహించి ఏర్పాట్లు చేయాలి.

కేవలం చిత్రాలను, ఫిలిం వ్యక్తులను పంపించడంతో తృప్తిపడక మన సినిమా పారిశ్రామికులు టెక్నికల్ విషయాల్లో రష్యన్ల సహకారాన్ని పొందడానికి కృషిచేయాలి. సినిమాకళలో రష్యన్లు తీసుకువచ్చిన అభివృద్ధి మనదేశపు వారి కృషికి తీసిపోనిది. వారినుండి మనం నేర్చుకోవలసిన దెంతైనా ఉన్నది. అస్తమానమూ హాలీవుడ్ కేసే చూస్తూ, హాలీవుడ్ నే గుడ్డిగా అనుకరించే మన సినిమా పరిశ్రమ రష్యన్ సినిమా పరిశ్రమవైపు ఇకమీదైనా దృష్టి మళ్ళించాలి.

పోగా, మన చిత్రాలు ప్రదర్శించడంలో రష్యన్ ప్రభుత్వం చూపిన శ్రద్ధలో సగమైనా మన ప్రభుత్వం రష్యన్ చిత్రాలను మనదేశంలో ప్రదర్శించడానికి చూపవలసి వుంది. ఈ విషయంలో ప్రభుత్వం ముందంజ వేస్తే, సినిమా పారిశ్రామికులుకూడా తగిన చర్యలు తీసుకొనగలరని తోస్తుంది.

## పంకజ్ మల్లిక్

"బెంగాలీ సంగీత దర్శకుడు పంకజ్ మల్లిక్ కిందటి నెల మద్రాసువచ్చి, మూగ, గుడ్డి పిల్లల పాఠశాల సహాయార్థం పాట కచ్చేరీ చేశారు. ఆ కచ్చేరీలో ఆయన ఒక తెలుగు పాటకూడా పాడి శ్రోతలను సంతోషపరిచారు. ఆ తరువాత నేను ఆయనతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ కొన్ని ప్రశ్నలు వేశాను. ఆయన తమ అభిప్రాయాలు నిర్మొహమాటంగా వెల్లడించారు. దాక్షిణాత్య సంగీతంపై తనకు చాలా గౌరవం ఉందనీ, కాని దక్షిణదేశపు సినిమా సంగీతంపై తనకు అంత మంచి అభిప్రాయంలేదనీ, బొంబాయి సినిమా సంగీతాన్ని అనుకరించడమే తన అయిష్టానికి కారణమని ఆయన చెప్పారు. నేషనల్ సంగీత్ అకాడమీ కచ్చేరీల సందర్భంలో కర్నాటక సంగీతం విని దాక్షిణాత్య విద్యాంసుల ప్రతిభకు ముగ్ధుడైనానని ఆయన అన్నారు. తెలుగుభాష చాలా శ్రావ్యమైనదనీ, తెలుగువారికీ బెంగాలీ వారికీ చాలా పోలికలున్నాయనీ ఆయన అన్నారు. యువక సంగీతకారులకు మీ సలహా ఏమిటని అడిగగా, జాతీయతను మరచి ఇతర సంగీత పద్ధతులకు ఎగబ్రాకవద్దని ఆయన సలహా ఇచ్చారు. కీ॥ శే॥ సైగల్ ను గూర్చి ఏమన్నా చెబుతారా అని అడగ్గా "నేను సైగల్ లో జీవించాను" అని అన్నారు.

ఆ రోజు కచ్చేరీలో పంకజ్ మల్లిక్ యేకాన్ అజ్ ఆయా, చలే పవన్ కీ చాల్, దోనైనా, పియా మిలన కో జానా మొదలైన పాతపాటలు పాడిన పద్ధతినిబట్టి ఆయన గానకళా ప్రతిభ నిత్యనూతనమని నాబోటివారికి అనిపించింది."

స్వర్ణకాంత్ ★



దూరతీరాలకు

—ఫొటో: కావూరి గోపాలకృష్ణమూర్తి—బాపట్ల.

## ప్రసిద్ధిగాంచిన పాండ్స్ క్రీములతో

# మీ ముఖమును మృదువుగ నిర్మలముగ ఉంచుకోండి



ప్రతి ఒక్కరి చర్మ స్వభావమునకు సరిపోయేలా రెండు ప్రఖ్యాతియైన క్రీములు

స్త్రీలు సౌందర్యమును కోరుట సహజమే! ఆ ఉద్దేశముతోనే పాండ్స్ క్రీములు తయారుచేయువారు మీ ముఖమును మృదువుగ నిష్కళంకముగ ఉంచుకొనుటకు సహాయముగ రెండు సౌందర్య సాధనలు యిస్తున్నారు. పాండ్స్ క్రీములు వేడి లేక చెమ్మగల ఏ ప్రదేశములోనైనా మీ చర్మమునకు రక్షణనిచ్చేలా తయారుచేయబడినవి. మరియు ప్రతి ఒక్కరి చర్మమునకు అది పొడిగానున్నా సరే లేక సహజముగ జిడ్డుగానున్నా సరే తగినట్లు ఉంటాయి. ప్రపంచమంతటా సౌందర్యవతుల వలె మీరూ వాటిని ప్రతిరోజు వాడండి!




మీ ముఖ కాంతిని పాడుచేయు పొడిగాలిగల ప్రదేశములో — పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలోనున్న విశేష నూనెలు మీ చర్మమునకు ఉపశమనమునిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది పాడిపోకుండా కాపాడును.




వేడి, చెమ్మగల ప్రదేశములో లేక మీ చర్మము సహజముగ జిడ్డుగా యుంటే — పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలెనున్న యీ క్రీమ్ రోమరంధ్రాలను అడ్డిన జిగటను, విర్జీవమైన రక్తకణములను అర్థము తీసి మీ ముఖమునకు సౌమ్యరక్షణ నిచ్చును.

మీ అభిమానపు పాండ్స్ క్రీమును ప్రతి దినము తప్పక వాడండి. కొన్ని రోజులలో మీ ముఖము నవవికసిత పుష్పమువలె నిర్మలముగ, మృదువుగ, మనోహరముగ ఉండుట మీరు చూడగలరు — అనుభవించగలరు కూడ!

## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు

**పాండ్స్** కోల్ క్రీమ్ / వ్యానిషింగ్ క్రీమ్

